# శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము



[ అమృతానందనాథస్వామివారిచే ప్రతిష్ఠితము ]

సీ॥ "కలవిశ్వమంతటఁ • గర్మార్హమైనట్టి
మర్త్యలోకంబె సం•మాన్య మందు
దత్త్వాంధ్ర మై యున్న • ధరణిఁ బెను దివ్వె
గా వెల్గు భారత•ఖండమందు
నధ్యాత్మవిదులు సం•దాచారఘనులచే
దీపించు నీ యాంధ్ర•దేశమందు
కలినాయకుండు వేం•కటనాథుఁ డుండు స
ద్ధామంబు శేషభూ•ధరమునందు
గీ॥ భోగిరాడ్భూషణాంచిత•మ్మును దిరుమల
శ్రీనివాస త్రిలింగాభి•ధానపీఠ
మిది మహావిద్యఁ గాంక్షించు • నెల్లభక్త
వరులు సేవింపఁదగినట్టి • పరమపదము."

—హంసవిజయము.

---

* పరిచారణ సౌకర్యముకొఱకు ఈ పీఠము పరిష్కృతము రాజధాని యగు చెన్నపురంబునఁ గవితిలకకుటీరమున నెలకొల్పఁబడియె.

శ్రీ రామ

శ్రీ జీవయాత్రాంతర్గత శ్రీనివాసశరణాగతి శ్లోకవ్యాఖ్యా.

శ్లో॥ శ్రీమన్నారాయణచరణౌ
మమతారహితహృదయనళినవసంతౌ
రామ శరణం ప్రపద్యే
భూమానందప్రదౌ విభూ సుమహాంతౌ.

నిరుపమాంధ్రగీర్వాణసరసకవితాభూషణభూషితయా సద్గురుకటాక్షలబ్ధవేదాంతతత్వజ్ఞానయాపరతత్త్వాయత్తచిత్తయా శ్రీకాంచనపల్లివంశతిలకాయమానయా అన్వర్థనామ్న్యా కనకాంబయా విరచితే ఽస్మిన్ జీవయాత్రాఖ్యమహాప్రబంధే శ్రీనివాసశరణాగతిశ్లోకం పశ్యతా తదలంకృతాన్యర్థవర్ణనాశక్తేనాప్యతికుతూహలప్రేరితేన మయా యథామత్యేతచ్ఛ్లోకార్థో వర్ణ్యతే

“ మంత్రం యత్నేన గోపయే ” దితి సంప్రదాయానుసారేణ “ గుహ్యానాం గుహ్య ముత్తమ ” మిత్యతిగోప్యం మంత్రరత్నమహామంత్రం గోపయంతీ అనుపూర్వ్యాంతరేణ తమేవ మంత్ర మనుసందధానా మంత్రస్య చాస్య శ్రీనివాసఏవ ముఖ్యాభిధేయ ఇతి తమేవ శరణం జిగమిషంతీ స్వీయశరణాగతిప్రకాశకం బహుభావగర్భం విదుషీమణి రేషా పద్యరత్నం విలిఖతి.

శ్రీమన్నారాయ ణేతి—

కేవల రామ మాశ్రయంత్యాః శూర్పణఖాయాః కర్ణనాసి కాచ్ఛేదస్య కేవలసీతా మాశ్రయతో రావణస్య సహకుటుంబ వినాశస్య సీతాసన్నిధౌ శ్రీరామ మాశ్రయత స్త్వత్యుగ్రా పరాధస్యాపి కాకస్య తత్కృపావిషయత్వస్య చానుభూతత్వేన శ్రీసహితనారాయణచరణావేవ సమాశ్రయణీయా వితి సంప్ర దాయః ప్రకాశితశ్రీమన్నారాయణచరణా వితి. ఏవం సంతోష కాలీనా ప్రార్థనా ఝడితి స్వాభీష్టఘటనాపటీయసీతి శ్రీసన్నిధా వేవహి భగవదాశ్రయణం యుక్తమ్.

"మమతారహితహృదయనళినవసంతా" ఇత్యత్ర నళినవసంతా ఇత్యనేన స్వాశ్రితాతిశుద్ధహృదయకుముదవికాస హేతుభూతమధుమాధవమాససదృశా ఇత్యర్థో గమ్యతే. ఏవం తాదృశహృదయనళినే నివసంతా ఇత్యపి నను విభూ మమతా రహితహృదయనళినవసంతా విత్యుక్తేః పరస్పరవ్యాఘాతః. విభుభూతయోః తయో ర్మమతాసహితహృదయనివాస స్యాను చితత్వాదితి తు నాశంక్యమ్. దారువహ్నిభంగ్యా సర్వత్రాంత ర్బహిశ్చ వ్యాప్నువతోఽపి పరస్య పుంస స్స్వాత్యంతాభిమత స్థలవిశేషే స్వాసాధారణదివ్యమంగళవిగ్రహేణ నివాసస్యైవ తదుక్త్యభిప్రేతత్వాత్. ఏతదేవాభిప్రేత్య సాక్షాద్భగవతై వాభిహితం "నాహం వసా మీతి."

శ్లో॥ "నాఽహం వసామి వైకుంఠే యోగినాం హృదయే రవౌ
మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద!"

శ్లో॥ జాత్యేఽహంకారమాతంగే సా జాతా మమతా సతీ
తయోః పుత్రాశ్చ షట్సంఖ్యాః కామాద్యాంతరశత్రవః.

ఇత్యేత న్మాతంగకుటుంబదూషితహృదయే నివసతో రపి తయో ర్వసతిః కంటకాగ్రవస్థిత ఇతివ దత్యంతానభిమతా. మమతారహితహృదయనళిననివాసస్తు 'శ్రీరంగరాజభృంగో మే రమతాం మానసాంబుజే' ఇతివ దత్యంతాభిమతేతిచావగమ్యతే.

'రామేతి సంబోధనాత్ – బ్రహ్మణి శ్రీనివాస ఇతి భగవద్భాష్యకారసూక్తిభంగ్యా అవతారాణాం తన్మూలకందస్య పరబ్రహ్మణశ్చ ధర్మ్యైక్యేన అభేద స్సత్సంప్రదాయసిద్ధ స్సూచితః. ఏవం హరిహరాత్మకత్వేన ముకుటజడాదిభి రనేకహేతుభి ర్నిర్ణీతస్య ద్రావిడవేదాంతశాఖాద్రష్టృభి ర్మహాయోగిభి స్తథైవ గీతస్య శ్రీనివాసస్యైవ ఇష్టదేవతాత్వేన కృతిగాధత్వేన చానుసంధీయమానత్వేన తాదృశభావప్రకాశనాయైవ రామేతి సంబోధనం కృతమ్. నైతేన హరిహరయో రైక్యం సిద్ధమ్. శ్రీభగవద్గీతాయాం విభూతివిస్తరాధ్యాయే "మాసానాం మార్గశీర్షోఽహం ఋతూనాం కుసుమాకరః" ఇతివత్ రుద్రాణాం శంకర శ్చాస్మీతి శంకరస్య స్వవిభూతిత్వస్య కథనాత్, తాదృశాకారస్యైవ శేషగిరౌ శ్రీనివాసేన ప్రదర్శితత్వాత్.

ఏవం నారాయణాష్టాక్షరీ శివపంచాక్షరీ మంత్రద్వయ జీవాతుభూతరామాత్మకవర్ణద్వయఘటితరామమంత్రప్రతిపాద్యే వస్తుని ప్రదర్శితమంత్రద్వయప్రతిపాద్య తత్త్వమహిమ్నాఃపూర్తి రపి స్ఫుటీకృతా భవతి ఏతదేవచ వైష్ణవానాం శ్రీరామేఽత్యంతభక్తే కారణమ్

భూమానందప్రదా వితి—

'యత్ర నాఽన్యత్పశ్యతి నాఽన్యచ్ఛృణోతి నాఽన్యద్విజానాతి స భూమా' యస్మిన్ పరబ్రహ్మణ్యనుసంధీయమానే సర్వమపీంద్రియజాతం స్వస్వవిషయపరాఙ్ముఖం సత్ తదేకలగ్నం భవతి స భూమేత్యర్థః 'భూమానందప్రదా' భగవచ్చరణా విత్యనేన ప్రపత్తిరేవ భగవత్ప్రాప్తిహేతు రితిసంప్రదాయోఽపి వ్యజ్యతే తాదృశానందప్రదత్వాదేవ సర్వలోకసమాశ్రయణీయాయా శ్రియోఽప్యాశ్రయణీయా జాతా ఏతదేవాభిహితం భగవతా వ్యాసమహర్షిణా శ్రీభాగవతే —

శ్లో॥ బ్రహ్మాదయో బహుతిథం యదపాంగమోక్ష
కామాస్తపః సమచరన్ భగవత్ప్రపన్నాః
సా శ్రీ స్స్వవాస మరవిందవనం విహాయ
యత్పాదసౌభగమలం భజతే ఽనురక్తా॥

ఏవం కులశేఖరయోగి రపి—

శ్లో॥ తవామృతస్యందిని పాదపంకజే, నివేశితాత్మా కథమన్య దిచ్ఛతి
స్థితేఽరవిందే మకరందనిర్భరే, మధువ్రతో నేక్షురకం హి వీక్షత ఇతి

“సుమహాంతా నిత్యాత్ర” “ఈశ్వరనుం, పిరాట్టియుమ్-విడిలుం, తిరువడిఘుళ్ విడాదు” ఇతి భగవల్లోకాచార్య శ్రీసూక్తిభంగ్యా శ్రీ శ్రియఃపత్యపేక్షయా స్వాశ్రితరక్షణే బద్ధదీక్షత్వరూపమేవ సుమహత్త్వం వివక్షిత మితి.

సేనాపతి నరసింహాచార్యః,
ఉభయవేదాంతవర్ధినీసంస్కృతపాఠశాలాస్థాపకః,
కురుట్లగ్రామవాసీ.



# ఆనందసారముపై

(విమర్శకాగ్రేసర నాగపూడి కుప్పుస్వామయ్యగారు రచించిన)

## 'కొన్ని పలుకులు'

"ఈగ్రంథకర్త్రిగారు (కంచనపల్లి కనకమ్మగారు) జీవయాత్ర, శాకుంతలము, హంసవిజయము, నమృతసారము మున్నగు గ్రంథముల వ్రాసి ప్రకటించి పండితుల మెప్పుఁ గాంచి యాంధ్రలోకమునకుఁ జిరపరిచితురాలగుటం జేసి యామె కవనపు నైపుణిం గూర్చి వర్ణించుట యనవసరము. కావున నీగ్రంథము నందలి విషయమును గుఱించి కొంకొక ప్రస్తావించెద.

జీవయాత్ర, హంసవిజయ మను నీరెండుగ్రంథముల వలననే యీనారీలలామమనంబు పరమేశ్వరభక్తిరసకలితమై యాధ్యాత్మికవిషయవిచారలోలుపమై చెలువారెడు నని తెలియనయ్యెడు. అట్టి యుత్తమజ్ఞానాసక్తి కలిగనేని కవిత్వశక్తిని దాదృశవిషయములయందే ప్రాయికముగా వినియోగింపఁ బూనుటవిపశ్చిద్వరేణ్యులకు నైజగుణంబు. గీర్వాణభాషయందు శ్రీశంకరాచార్యులు, శ్రీవేదాంతదేశికులు, శ్రీమదప్పయ్య దీక్షితులు, నీలకంఠదీక్షితులు, వాదిరాజయతివర్యులు మున్నగువారును, నాంధ్రంబున బమ్మెరపోతన, గురుమూర్తికవి

మున్నగువారును దమకవితాశక్తిని నిట్టివిషయములయందే విని యోగించిరి.

కనకమ్మగారును నిజగురూపదేశమహిమమున వేదాంతార్థ విచారపరురాలైన కతంబున నిట్టి విషయములయందు నిజకవితాశక్తిని వినియోగించుట సహజము.

ఈ యానందసారమందుఁ గవయిత్రి నిజగురూపదేశ సంజనితములగు భక్తిజ్ఞానంబుల ప్రాశస్త్యంబును నుపాదేయ వర్జనీయ విషయముల తెఱంగును నాత్మానుభవావిష్కరణపురస్సరముగాఁ బ్రతిపాదించియున్నది. కొన్నిపద్యములు కేవలవేదాంత వాక్యార్థబోధకంబులుగను, గొన్ని స్మృత్యర్థములు వివరించునవిగను, గొన్ని కేవలభక్తిని వర్ణించునవిగను, గొన్ని నీతిబోధకములగను గన్పట్టుచున్నవి. అనేకపద్యంబులు గురూపదేశ మహిమస్తావకంబులై తనరారెడు. వీనిలో నొకకొన్నింటి నిచటఁ బ్రదర్శింతు—

“ యస్యామతం తస్య మతం మతం, యస్య న వేద సః
అవిజ్ఞాతం విజానీతాం, విజ్ఞాత మవిజానతామ్. ”

అను తలవకోపనిషన్మంత్రము (2 - 3) దీనియందు

“ తెలియ మనుకొనువారలె తెలిసికొండ్రు
తెలిసికొంటిమి యనువారె తెలియకుండ్రు. ” 3x

అని తెలుఁగుసేయఁబడియున్నది.

" భిద్యతే హృదయగ్రంథి, శ్ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి, తస్మిన్ దృష్టే పరావరే. "

అను ముండకోపనిషన్మంత్రమును (2-2-8) కనకమ్మగారు

" అప్పరావరుదర్శనమైనమాత్ర
సర్వసంశయభయములు సమసిపోవు
కర్మము హరించును హృదయగ్రంథి విడును
సత్య మిటు వేదనిచయంబు చాటుచుంట. " ౨౮

అనియును—

" యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ "

అను తైత్తిరీయోపనిషద్బ్రహ్మానందవల్లియందలి 9 వ మంత్రమును

" మాట లెందునుండి మఱలుచుండును దేని
మనసు చేర లేదు వినుము యట్టి
యాత్మయై వెలుంగు......... " ౯

అనియును—

" సర్వంఖ ల్విదం బహ్మ " అను ఛాందోగ్యోపనిషన్మంత్రమును

" అది వేదమంత్రసారం
బది దేశికసూక్తి బుధులయనుభవ మదియే

ఇదియంతయు బ్రహ్మం బను
నది తెలియఁగఁ గోరువాఁడె యవలంబించున్." ౩౧౫

అనియును—

"అహం బ్రహ్మాస్మి" యను మహావాక్యమును
"కాంచువాఁడు పోవఁ గల్ల జగము పోవు
నహ మనంగ బ్రహ్మ మగుటఁ జేసి." ౩౫౧

అనియును గవయిత్రిగా రాంధ్రీకరించియున్నారు.

ఇటులే స్మృతివాక్యములు గాంచ నగు.

"యస్మా న్నోద్విజతే లోకో లోకా న్నోద్విజ్యతేచయః
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్"

అను భగవద్గీతావాక్యము

"ఇతరులకుఁ దనవలనఁ దన
కితరులవలనను భయం బొకించుక వల దట్టి
వ్రితము మహాత్ములు సలిపెద
రతులితగతి నాత్మఁబోలి యలరుటఁ జమ్మా!" ౨౧౫

అను పద్యమునందును—

"యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతినైష్ఠికీం"

అను గీతావాక్యము

"కర్మఫలంబులఁ గోరక
యర్మిలి నాత్మార్పణంబు సతిశయభక్తి

ధర్మము తప్పక చేసెడు
నిర్మలమతి కితరధర్మనియమం బేలా ?" ౧౭౧

అను పద్యంబునందును—

"యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
య త్తపస్యసి కౌంతేయ! త త్కురుష్వ మదర్పణమ్.
ఓ మి త్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్"

అను గీతావాక్యము

" వట్టితలపులఁ జాలించి గట్టిదైన
నీశ్వరేచ్ఛను నెఱ నమ్మి యీశ్వరార్ప
ణముగ సర్వముఁజేసి ధర్మము భజించి
ప్రణవసంజ్ఞ సద్యోగంబుఁ బ్రబల నిమ్మ." ౩౯౭

అను పద్యమునందును—

"మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః"

అను మహాభారతవాక్యము

"తనమనమే తనబంధం
బునకుఁ మోక్షంబునకును ముఖ్యంబగు కా
రణ మని పెద్దలు తెల్పఁగ
వినియుఁ ధర్మంబు తెలియవే మూఢాత్మా!" ౩౮౨

అను పద్యంబునందును—

" నా పృష్టతః కస్యచి ద్బ్రూయాత్ "
అను మనూ క్తి—

" అడుగనివానికిఁ జెప్పఁగఁ
బడకేలా పలుగతులను బాధల జీవా! " ౨౧

యను పద్యమునందును ననుసంధేయంబులు.

" తనతోట నూరు నీరే
తను జీవింపంగఁజేయుఁ దథ్యం బటులే
తనలోఁ బుట్టిన దేవుఁడు
తను సంరక్షించు సర్వథా హైక్యమునన్. ౫౪౯

అను నిందలిపద్యము —

" గవాం సర్పి శ్శరీరస్థం న కరో త్యంగపోషణం
నిస్సృతం కర్మరచితం పున స్తస్యైవ భేషజమ్ "
అను ప్రాచీనో క్తిని,

"యు క్తిమీద యు క్తి నూహింపుచున్నచో
ము క్తి వచ్చు నొక్క మోహ మెచ్చు " ౪౬౭

అను గ్రంథస్థవచనము—

" తర్క స్యాప్రతిష్ఠానాత్ " అను బహ్మసూత్రమును—
" దు స్తర్కా త్సువిరమ్యతాం " అను శ్రీశంకరభగవత్పా
చార్యులవారి యుద్దేశమును — దలంపునకుఁ దెచ్చుచున్నవి.

కనకమ్మగారి మనమ్మున శివ, విష్ణు, శక్తి ప్రభృతి దేవతామూర్తులయెడ నెట్టి తారతమ్య భేదజ్ఞానము నుంతయేని యున్నట్లు గోచరింపదు. ఈగ్రంథమందుఁ గొన్ని పద్యములలో శివునిఁ గొన్నింటిలోఁ గృష్ణునిఁ గొన్నింటిలో శేషాద్రివిభుఁ డగు వేంకటేశ్వరుని, గొన్నింట రామచంద్రుని, గొన్నిటిలో బరదేవతను సంబోధనము గావించియునికియే దీనికి నిదర్శనము. ఇట్టి యుక్తిమజ్జ్ఞానము కుదురుట పండితుల కనేకుల కరిదిగా నుండఁ గనకమ్మగారి కిది యచంచలరీతిని గుదురుట స్తవనీయము.

"ఒక్క బ్రహ్మమందుఁ బెక్కు జగంబులు,
కల్పితములు" 310

"అహ మనఁగ బ్రహ్మ మగుటఁ జేసి" 311

అను నీమొదలగువాక్యములంజూడ నీమె కద్వైతము నందే పరమతాత్పర్యం బని యూహింపఁదగియున్నది.

గ్రంథకర్త్రిగారికిఁ గల గురుభక్తివిశ్వాసగౌరవము లపారము లనియు నందలి పలుపద్యములవలన నెఱుంగ నగు. ఒకటి రెంటిని జూపెద—

"గురుభక్తి గురునిసూక్తిని
గురువృత్తిని మదిని నిల్పుకొని జీవితముం
ధరఁ గడపెడు నాతం డిహ
పరసుఖములకొఱకు వెదకవలెనా తనకై." 204

" ధర్మమే యవతారంబుఁ దాల్చినట్లు
తనర శ్రీగురుస్వామి ముందరను నిల్పు
కొని తదీయశక్తిని భజింపు నిరతంబు
స్వస్వరూపానుసంధానసరణి యిద్ది. " ౮౬౬

ఈచక్కని గ్రంథమునం దనేకాధ్యాత్మవిషయములు సులభలలితశైలిని దెలుపఁబడియున్నవి. వానిలో నొక కొన్నింటి నిక్కడఁ బ్రదర్శింతు.

" నిజధర్మము భజియించుట
భజియింపమి ద్వంద్వసమితి భగవంతునిలో
భజియించుట గురుసూక్తిఁ
భజియించుట యాత్మతత్త్వభజనముకాదే? " ౯౫

" ఆత్మ నీశ్వరునకు నర్పణం బొనరించు
భక్తశేఖరులకుఁ బ్రజ లొనర్చు
పుణ్యపాపసమితి పురుషోత్తమున కాటఁ
దత్తు దుచితఫలము తప్పకుండు. " ౫౧

" ఉండి లేనట్లు బ్రహ్మంబ యుండు నొకఁడు
లేకయున్నట్లు తోఁచు నీలీల జగము
కనఁగ రెండును నుండి యొక్కండె యాటఁ
దనదు తత్త్వంబుగాఁ దెల్పు ధన్యతముల
భక్తవరులను జేయంగఁ బ్రబలినాఁడు
కృష్ణవేషంబుఁ దాల్చి శ్రీవిష్ణుమూర్తి. " ౩౧౭

"లేని యహా మను పశువును లేనియట్టు
లున్న యహా మను బహ్మాంబు నున్నయట్లు
చేసి యుభయథా సంపూర్ణుఁడై సుఖింప
నిత్య మగును జీవన్ముక్తి సత్య మగును." ౬౧

"కంబమందు హరిని గనియెఁ బ్రహ్లాదుండు
తనకు నెదుట నిలువఁ గినఁడు తండ్రి
ఈశ్వరేచ్ఛవలన నద్దేని సిద్ధించు
నాత్మయందు నాత్మఁ డాడుచుంట." ౨౮౧

పరమశాంతిని నలవరచు నష్టవాక్యములు నివ్వటిల్లు నీగ్రింథ మానందసార మని చెప్పఁదగియుంకుటకు సందియము లే దని తలంతు.

ఈకవయిత్రికిఁ దత్త్వానుభవముకలిగె నని యీక్రింద నుదహరించిన పద్యములవలనఁ గోచరం బగు.

" అమనస్కరాజయోగము
క్రమముగ సిద్ధించె నేటికాలమునకు శ్రీ
రమణుని కృపఁ దత్సన్నిధి
విమలమతిఁ నిల్వఁగంగ విజ్ఞత కలిగెన్." ౧౭౦

"సంసారదుమబీజము
కంసారిఁ మదినిఁ జేర్చి కలకాలము స
చ్ఛంసనముం గాంచిన వి
ద్వాంసుల సద్భక్తిఁ గొల్చి తత్త్వ మరసితిన్." ౨౨౫

“సమరసదృష్టినొప్పు గురుస తముపాదము గొల్చుచుంట నే
విమలమతిఁ జరింపఁగల విద్య లభించె ముదంబుపెంచె బ్రి
హ్మము లలిమూర్తిఁదాల్చినటు లారయఁగాఁగనుపించెఁబండితో
త్తముఁడు దమోహరుం డిల నుదారచరిత్రుఁడు బూతగా
త్రుఁడన్.” ౩౨౦

ఈకవయిత్రిమణి కేవలరసవత్కవిత్వాసక్తులకు రుచించుటకై గ్రంథాంతమందు శృంగారరసమును శాంతరసముతో మేళనముచేసి, షడృతువర్ణనమును, రవీందూదయాస్తమయవర్ణనమును గరంబు మనోహరంబుగాఁ గావించియునికి సహృదయహృదయాహ్లాదకరంబై యలరారెడు వానిలోను—

“కామంబున సమకూర్చిన
సామగ్రికి వడఁకి విడువఁజను యోగుల నీ
హేమంతము వడకించుచు
రామాశ్రియ మబ్బఁ జేయుఁ దా గురునిక్రియన్.” ౪౭౪

అను నీహేమంతఋతువర్ణనమునందలి శ్లేషచే నుప్పతిల్లి యొప్పారు చమత్కృతికి సహృదయులు తమడెందంబులఁ జొక్కి సొగియుదు రని భావించెద.

మధుర,
19-3-1936.

నాగపూడి కుప్పుస్వామయ్య.



# అమృతానందనాథప్రశంస



కవిసార్వభౌమ

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి కృతము

మ॥ అజరుండై యమృతుండునై యమలుఁడై
యానందనాథుండునై
యజరుద్రాంచితకృష్ణభూషణమునై
హరోపేంద్ర బ్రహ్మంబునై
త్రిజగద్వంద్యపదాభిషిక్తుఁ డగుచున్
దీపించు మా దేశికున్
నిజహృత్పద్మమునందు నిల్పి సతమున్
సేవించి భావించెదన్.

# అమృతానందనాథస్వామి ప్రశంస

[ కవితిలక కనకాంబాకృతము ]

శ్లో॥ అమృతానందనాథాయ నాథాయ దృఢచేతసాం
చేతఃప్రీతిప్రదానాయ జ్ఞానాయ మహసే నమః.

మ॥ అమృతానందుని నాశ్రితావనుని స
స్వార్థాభిధానున్ గురున్
సుమనఃకోవిదు సూరిలోకవినుతున్
సుశ్లోకుం గీర్తింతు స
ద్విమలాచారుని శబ్దశాస్త్రచతురున్
విజ్ఞానసంపత్ప్రదున్
సమునిన్ స్వాత్మసఖైకవేది ననఘున్
సర్వార్థసంధాయకున్.

# శ్రీమాన్ అమృతానందనాథస్వామినాం ప్రశంసా.

బ్రహ్మశ్రీ లంక లక్ష్మీనరసింహశాస్త్రిణా విరచితమ్

## "మహాపురుష సందర్శనమ్"

పాపభూయిష్ఠే ప్యస్మిన్ తిష్యే తత్ర తత్ర పుణ్యారణ్యేషు, దివ్యక్షేత్రేషు, వివిక్తేషు, గిరిగుహానదనదీపులినేషు చ సాధవో మహాశయాః గూఢం వసంతీతి సర్వేషామప్యాస్తిక జనానాం విశ్వాసః. తత్ర యేతు ప్రాగ్భవీయసుకృతపరిపాక సమాసాదితవివేకవైరాగ్యాదిగుణగరిష్ఠాః తేషామేవ తాదృశా నాం దర్శనమ్. అథవా మహానుభావతాపరిజ్ఞానమ్ నహి ప్రాకృతాః సన్నికృష్టమపి సాధుపుంగవం ఆత్మవిదం మన్యంతే. కుకురాంధకభోజాదిషు కతిచిదేవాక్రూరాదయః పరమభాగవతా భగవంతం యాథాతథ్యేన భేజిరే. అతశ్చైకాంత భక్తాస్తత్వనిష్ణాతా వసంతీతి మూర్ఖానాం ప్రలాపః. తథాఽపి విరళాఏవ తాదృశా మహామణయఇవ దృశ్యంతే. తేషాం మహానుభవః శిష్యముఖేభ్యఏవ లోకైర్జ్ఞాయతే. రామకృష్ణ పరమహంసాదయోహి పరమపురుషాః వివేకానందాదిభిరేవ సర్వేషాం శ్రవణగోచరతా మనీయంత.

శ్రీసదాశివేంద్రయతి రష్టాంగయోగకుశలః ప్రాప్తసిద్ధి
రపి కావేరీతీరే బభూవేతి 'సహృదయ' ప్రకాశనేనైవ ఆబాల
వృద్ధ మవగత మాసీత్. తాదృశశ్చ కశ్చన దివ్యశక్తిసంపన్నో
ఽమరగురుమపి ప్రజ్ఞయా ఽతిశయానో విదితసకలశాస్త్ర
సూక్ష్మార్థః రాజయోగీ ప్రాకృతేనైవ వేషే ణాగ్నిరివ భస్మనా
పరిచ్ఛన్నో ఽమృతానందనాథేతి దైక్షికనామా నాగభూషణ
శాస్త్రీతి వ్యావహారికనామా చాంధ్రదేశే కృష్ణామండలే జజా
గారేతి మహాదాశ్చర్య మేతద్భుతానామ్. యేహి మధ్యదేశే
వర్తమానా అపి బాహ్యవిషయైర్ముఖ్యేన న సర్వైర్విదిత
ఆసీదితి మహా దేత ద్విషాదస్థానమ్. సర్వోఽపి లోకః వాగా
డంబరేణ యే సంఘ మాకులయంత్యథవా సేతూ నుద్భేద
యం త్యాహోస్విద్ధర్మ మపధ్వంసయంతి, అథవా స్వాస్థ్య
మవసారయంతి, తానేవ ఖలు రాష్ట్రం సేవంతఇతి, దేశ ముద్ధర
తీతి వా సంభావయంతి కీర్తయంతి బిరుదదానేన సమ్మాన
యంతిచ.

ఏషఖలు మహాశయః సువర్ణముఖరీతీరే తుంబూరు
క్షేత్రే స్వానురక్తైః భక్తకుశలైః తత్త్వకాంక్షిభిః కతిభిరే
వానుచరైః సేవ్యమానో నైమిశారణ్యే శౌనకఇవ సాంతత్యేన
సచ్చింతనాయ సత్త్రయాగ మకారయత్. తత్రచ త్రికాల
మాదిత్యాది పంచాయతనపూజా మహోరాత్రంచ హరిగుణ
కీర్తనం చాకుర్వన్ భక్తజనాః.

ఏవంస్థితే, విజయవాటికాయాం తేషా మత్యంతరక్తో ఽభిజాతకులోత్పన్నః చుండూరు వేంకటరెడ్డినామధేయః సుప్రసిద్ధవణిక్పుంగవః భాష్యాదికం తత్ర శ్రావయం త్వితి మా మవోదయత్. ఏతావ త్తత్ర ప్రవర్తత ఇత్యజానన్నపి అతిచిరం పఠితానాం సద్గ్రంథానా మిదానీం పునరాఖ్యానాయ మహా నవకాశో ల[illegible] ఇతి ముదా, ఆంగ్లపాఠశాలాయా ముపాధ్యాయపదవీ మసాధారణపరిశ్రమలబ్ధామపి పరిత్యజ్య వణిక్పుంగవలబ్ధమార్గవేయః ప్రభవవత్సరే అగ్రహాయణికమాసి కృష్ణదశమ్యాం విజయవాటీతః ప్రస్థితే ఏకాదశ్యా ముదితే రవౌ నాయుడుపేటనామ్ని ధూమశకటస్థలిస్థానే ఉపాతరమ్. మా మానేతుంచ శ్రీయుతాః దంటు సుబ్బావధానినః సమీయుః. తా నాపృచ్ఛ్య శకట మారుహ్యాచిరాదేవ సత్రయాగశాలాం ప్రావిశమ్. తత్రచ పాద్యదానేన సుఖాగమనపృచ్ఛయాచ బహుథా మా ముపాచరన్ సర్వేపి. తదను స్నాత్వా సంధ్యా ముపాస్య తస్మిన్నేవ దివసే యోగ్యతా ముద్వీక్ష్య భాష్యప్రవచన మారేభే. అల్పారంభాః క్షేమకరా ఇతి న్యాయేన "అథాత" ఇతి ప్రథమసూత్రస్య ఉపోద్ఘాతం రత్నప్రభానుసారిణ ముపక్రమ్య వ్యరమమ్. తదానీంతు శ్రీస్వామినః మానుష్యలోకావతీర్ణా సరస్వతీవ సకలవిద్యాశోభితా శ్రీమతీ కనకాంబాచ శ్రీఅవధానిప్రభృతయశ్చ త త్రోపావిశన్. మధ్యాహ్నేతు సత్రయాగశాలాయాం షడ్రసోపేత మభ్యవ,

హారం మృష్టాన్నం, సాయంతనే సమయే శ్రీస్వామిభిః విస్రం
భాలాపభాగ్యమన్వభవమ్. తదానీంచ శ్రీస్వామిభిః అనేకాను
భవైకవేద్యా దురూహాశ్చ తత్త్వప్రసంగా అక్రియంత.
రాత్రౌచ భోజనోత్తరం సావకాశ మధ్యాత్మరహస్యానాం లీల
యైవ సుబోధతాకరణం బ్రహ్మేవ నారదాయ సర్వార్థాన్
పురతః పశ్యతామివ ఝటితి వ్యాఖ్యాతిం చాకలయ్య నూన
మిమే ప్రాగ్భవీయసుకృతేన వామదేవఇవ పండితాః, ఆచార్యా
ఇవ బోధకాః, బాల్యతఎవ సంపన్నాః, మహిమానుశాలినః
సిద్ధపురుషా ఇతి యే మనసి ఉదభూ ద్వితర్కః. శనైశ్శనై
శ్చలితే ప్రభాతే భాష్యప్రవచనే కాంశ్చి దపూర్వాన్
శాస్త్రీయధర్మాన్ విద్వ దనుభవగోచరాన్ ప్రకటయంతః
మహాంత మనుగ్రహం మయి ప్రకాశయామాసుః. స్వామినాం
బోధవిశేషాః సర్వేపి సమయఏవ గద్యరూపేణ లిఖిత్వా తదను
పద్యరూపేణ పరివర్తయామాస శ్రీమతీ గురుదీక్షావతీ కన
కాంబా తస్యైవ ప్రబంధస్య శ్రీజీవయాత్రేతి నామా తదను
అవశిష్టాన్ కాంశ్చి ద్బోధాన్ హంసవిజయనాటకరూపేణచ
ప్రకాశయామాస.

అత్ర ఖలు గ్రంథద్వయే అన్యేష్వపి ఆనందసారాదిషు
శ్రీ మద్భాగవతాదితత్త్వప్రతిపాదకగ్రంథీయవిశేషాః సుగ
మయా శైల్యా రీత్యంతరేణ ప్రకాశితా ఇతి సువ్యక్తం భవతి
స్వామినాం బోధానుభవశాలినాం. కిం చైష మహాభాగః

స్వయం తాదృశవిద్వానపి కించిదపి స్మయ మకుర్వన్ మాం పండితమివ, సోదరమివ, సుహృదమివ ఆదరబహుమానసన్మానాదిభిః నితరాం ముద మాపయామాస. న కేవలం మయ్యేవ యేతు ఆస్తికాః విద్వాంసః స్వధర్మశీలాః, తా న్సర్వానపి పరిచరతీతితు తత్వవిదో విశేషః. పరిస్ఫోరయతి కించ స్వయం జ్ఞాతాపి సన్ "స బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినా" మితి గీతాచార్యోక్తదిశాలోకసంగ్రహం కామయమానః సకల మపి నైదికకర్మ తతః కుర్వన్ కారయం శ్చావర్తతేతి సమదృష్టితాం తేషా మభివ్యనక్తి. ఆంగ్లభాషాయాం వైద్య కేచ తేషాం మహాన్ పరిచయ ఇతితు సర్వేషాం విదితపవాంశః. కించ గుర్వనుగ్రహేణ సర్వశాస్త్రేష్వపి తేషా మకుంఠితా బుద్ధిరితి శనై శ్శనైః తదా తదా సమయే ప్రచలితై స్తేషాం వాఙ్మయైః స్పష్టమే వావబోధి. కింబహుధా పాకోపి తై రపూర్వః అసాధారణశ్చ క్రియతే. ఇతి కిము వక్తవ్యం తేషాం సర్వవిత్త్వం. ఈదృశానాం తేషాం సవిధే మాసాన్ షట్ అయాపయం. తేషాం సన్నిధానవశేన బహ్వ బుధ్యత మయా. శిష్యాన్ వినేతుంచ తఏవ కుశలాః. మానసికమ ప్యపచారం పరిజ్ఞాయ యస్య యస్య యాదృశదోషసంతతిః యథా నివారణీయా ఇతి సర్వమపి తథైవ ప్రతివిదధతే తథైవ.

యద్యపి పండితాః తత్త్వవిదశ్చ విరళా స్సంతునామ. అథాపి మహతా శ్రమేణ శిష్యాణా మనుశాసనే ప్రవృత్తాః.

కించ సర్వమపి జాగ్రత్స్వప్నావస్థగితం, బాహ్య మాంతరంగికంచ, శీలం చేష్టాంచ పరిశీలయంతః యథాకథంచి దేశోఽపి సంప్రదాయశుద్ధః తత్త్వవేత్తాచ భూయా దితి ప్రియతమానస్తు ఏతఏవేతి మహాద్భాగధేయ మాశ్రితానాం. కించ తే వినేయే ఉపచారే శీఘ్రా, ఆదరణబోధాతిశయేన శాంతాశ్చ సముద్భృశ్యంత. తే ఈదృశా స్తాదృశా ఇతి న పారయామో నిర్ణేతుం సర్వథా గీతాద్వితీయాధ్యాయే ప్రతిపాదితస్థితప్రజ్ఞలక్షణలక్ష్యభూతా ఇతి మమ విశ్వాసః.

తేషాం వాదసరణిరపి అన్యాదృశీ నితరాం చకాస్తి. కదాచి దనుభూత ముదంతం వినివేద్య విరమామి. తుంబూరుక్షేత్రే వైశాఖశుక్లపూర్ణిమాయాం కశ్చన ఉత్సవః ప్రతిహాయనం ప్రతన్యతే. తత్రత్య స్వామినః తదానీం బహవో జనాః పామరా లౌకికాశ్చ అమిలంత. దేవాయతనస్య పురతయేవ సత్త్రియాగశాలా ప్రకాశతే. తత్రాపి వేంకటేశ్వరం శ్రీఅమృతానందనాథస్వామినః దిదృక్షవ స్సమాజగ్ముః రనేకే. తదానీం కశ్చన రక్షకభటశాఖయోద్యోగీ బ్రాహ్మణశూద్రాదివిభాగో బ్రాహ్మణై రేవ కల్పితః. స్వగౌరవాధానాయ న వ్యాత్మనో వర్ణాశ్రమాదయ స్సంతి, కథ మేవ విభాగ స్సమీచీన

స్యాదితి పప్రచ్ఛ. తదానీం స్వామినః పరిసరే ఉపవిష్టాన్ సర్వానపి తాదృశానే వాకలయ్య కోఽయం సృష్టా వర్ణాదివిభాగస్య, నను త్వమేవ త్వయి, ఆశ్రమాదిక మధ్యవస్యసి, నిద్రాణే త్వయి సర్వమపి లుప్తమాసీత్. జాగ్రంశ్చ భవాన్ అహమేతద్వర్ణః గృహస్థః, బ్రహ్మచారీ అముకపుత్రః అముక నామేతి సర్వం కల్పయతి తత్ర కథ మన్యం నిర్మాతార మాకలయసీతి సయుక్తికం సశాస్త్రం వర్ణాశ్రమవిభాగాదీన్ తైస్సర్వైరపి యుక్త్యా నితి గ్రాహయామాస. ఈదృశ్యో వాదపద్ధతయః బహ్వ్యః స్వామిషు ప్రాకాశంత సమయవిశేషేషు. ఏతాదృశాశ్చ మహాంతః ఈషన్న్యూనపంచాశద్వయస్కా ఏవ విదేహకైవల్య మాప్తా ఇతి దుర్దైవ మాశ్రితానాం గర్హణీయం తేతు కృతకృత్యా ఇతి న కించి ద్ధీయతే. జీవంతఏవ తే మహాత్పద మాశ్రితాః ఖలు.

ఈదృశాశ్చ మహాయోగినః 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' ఇతి గీతాచార్యోక్తదిశా తదా తదా సమయే తత్ర తత్ర ప్రాదుర్భూయ ధర్మవిశేష మనురక్తానాం శ్రావయిత్వా పున స్స్వపద మావిశంతి. ఇదానీమపి శ్రీఅమృతానందనాథగురూక్తదిశా స్వధర్మానుష్ఠాన మాచరంతి

తద్భక్తాః. తత్ప్రతిష్ఠితే తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠే సర్వేఽపి ముముక్షవః తత్ప్రదర్శితం అభ్యుదయనిశ్శ్రేయసపద్ధతిం అనూచానధర్మతః ప్రాప్తాం, ఆర్షవిజ్ఞానరక్షణంచ శ్రీమద్భిః కనకాంబాఅవధానిప్రభృతిభిః నిర్వ్యాజ మనుష్ఠీయమానాం త్రికరణశుద్ధ్యా అవలంబ్య తరంతు తేషాంచ సాహాయ్యక మాచరంత్వితి అభ్యర్థ్యంతే.

ఓ మి తి శి వ మ్.

శ్రీ రా మ.



# కవితిలక కనకాంబా ప్రశంస

[శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి విరచిత
జీవయాత్రా ప్రశంసనుండి]

"ఇట్టె దుర్భిక్షకాలమం దెపుడొ పూర్వ
ముపనిషత్తుల వినఁబడు నువిదలతల
మానికంబునుబోలెడి మగువ యొకతె
పుట్టె మన భారతీయుల పుణ్య మనఁగ.

కలిమికిఁ దానకంబయిన కాంచనపల్లి కులంబునందుఁ గాం
తలతలమానికంబయి తనర్చెడి రంగమకున్ మహాతపః
కలితుఁడు రంగనార్యునకుఁ గాదిలికూఁతురుఁగా జనించె జ్ఞా
నులకునునక్కజంబు మదినూల్కొనఁ జేయువెలంది పేరిమిన్.

పేరు జీవయాత్ర, ధోరణి సరళంబు,
తప్పు కానరాదు, తత్త్వ మెల్ల
యెడల వేద్య, మిట్టియెడద యే సాధ్వికిఁ
గలుగుఁ ? బున్నె మెంతొ సలుపకున్న.

ఈయమ పాండితీగరిమ, మీయమ జ్ఞానవిశేష, మీ మహా
ధీయుతురాలివర్తన, విధేయత, యోగ్యత, నీతియుక్తి, యాం
గ్లేయకళాపరివిష్టత, మలీమసకార్యపరాఙ్ముఖత్వమున్
ధీయుతు లీకృతిన్ గనినఁ దెల్లముగాఁ బొడకట్టు సర్వమున్.

కావున విస్తరింపక యింకన్ విరమించెదఁ గబ్బ మిద్ది స
ద్భావులకున్ ముదం బిడుచు భావికలార్థుల భాగ్యరాశియై
యీవిపులన్ యశమ్ముఁగని యెల్లెడల న్జయమందుఁగాక! యీ
కోవిదురాలి పుట్టువునకున్ ఫలమబ్బెడిఁగాత! పూర్ణమై.

---

[కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి కవి విరచితము]

తనవరసౌధమందు గురుడై వసమంచితసత్యవీరమున్
మునిజనసంప్రదాయమును బోషణచేసి గురూక్తపద్ధతిన్
బొనరించిమూఁడుప్రొద్దులనుబూజలొనర్చుచుఁబుణ్యవిగ్రహం
బవఁదగి ధన్యయైన కనకాంబ కెసంగుఁ జిరాయురున్నతుల్.

శా॥ ప్రత్యూషంబున లేచి స్నానమును దేవబ్రాహ్మణారాధన
ప్రత్యాహారవిహారముల్ సలుపుచున్ వ్యక్తిత్వమున్ గాంచనై
నిత్యైశ్వర్యముఁ గొన్నమేటి యయినన్ నిర్లిప్తయై జీవునిన్
సత్యాన్వేషణ సేయు మా కనకమున్ వర్ణింతు బ్రహ్మంబునాన్.

---

(బ్రహ్మశ్రీ కురుకంటి సూర్యనారాయణశాస్త్రిగారు రచించినది)

ఉ॥ తూచివ మోచ కిద్ది సరితూగు రసం బది శాంతవార ! నేఁ
జూచితి జీవయాత్ర పరిశోధనగాఁ బ్రతిపద్య మొందుఁ దా
ల్గోచదు స్వస్వరూప మవలోడన సేయు తదైక్యభావనా
సూచన లింపు తోఁ గనక సూక్తులు ముక్తికిఁ దావలంబగున్.

ఉ॥ కాంచనపల్లివంశమునఁ గాంచిన మా కీర్తిరత్నమాల యా
కాంచనగాత్రిధీపరమకాంతి తమోహరమౌచు జీవదే
వాంఛితసచ్చిదైక్యరమవర్ణన సేసిన "జీవయాత్ర" పాత్ర
పంచిక ముందుదాకఁ గడువాసిగ నుండుత కీర్తిభాసిలన్.

---

( విమర్శకాగ్రేసర నాగపూడి కుప్పుస్వామి అయ్యగారు )

కం॥ భవ్యంబై లలితపద
ప్రవ్యంబై వఱలు సుజనసంసేవ్యంబై
దివ్యంబై పండిత సం
భావ్యంబై నీదు కృతులు మహిఁ గనకాంబా !

చ॥ విమలములైన భావములు; విశ్రుతమై తగురీతు, లార్యవం
ద్యములగువృత్తులుగ్ నయనిధానములైన గుణంబులుగ్ మనో
జ్ఞములగువాగ్విలాసములు, చక్కనికాంతులుసొంపుమీఱు ను
త్తమసతిలీల నీదు కవితాసతి చెన్నలలారు నమ్మరో !

కం॥ నీరీతిఁ గవితచెప్పెడు
నారీతిలకముల నేఁ గనఁ గనకాంబా
హారియశోవిభవంబులు
మారమణుని దయను జెందుమా మహిలోనన్.

---

( బ్రహ్మశ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయ,
వేంకటనారాయణ సోదర కవులు )

ఉ॥ సత్యము దాపనేటికి రసజ్ఞులు మెచ్చఁగఁ దత్త్వబోధనల్
నుత్యములైన భావములు నూల్కొనునట్లు రచించినావ సౌ
చిత్యము గానరా దెచటఁ; జెప్పఁగ నేటికిఁ గల్గు జన్మరా
హిత్యము, మోక్షమున్గలుగునింతటిసత్కృతివ్రాసినందుకున్.

ఉ॥ ఇంతకుమించి వేఱె వచియింపఁగనేటికిఁ బెక్కుసార్లు శా
కుంతల మొక్కటే యశము గూర్పగఁజాలిన గ్రంథరాజ మా
వంతయు లేదు సందియము నాపయి నీదగు 'జీవయాత్ర' ఖం
డాంతరమందు నిల్పఁగల దంతకు మించిన కీర్తికీర్తులన్.

---

( సకలకలావిచక్షణ కాశీ కృష్ణాచార్య పండిత కవీంద్రకృతము )

'మహాశయా! జీవయాత్రయను పుస్తకరత్నమును గూర్చి నాయభిప్రాయము కావలయు నన్న గ్రంథములోని యొక్కొక్క పద్యమునకు రెండేసిపద్యములవంతుననైన నాయభిప్రాయపద్యముల వ్రాసినఁగాని చాల దని నాయభిప్రాయము. అయ్యది యసంభవమని తోఁచి యనంతానంతగుణపరిపూర్ణుఁడగు భగవంతుని వర్ణించు వేదములను బ్రణవమున నిమిడ్చినట్లు జీవయాత్రయందు నాయభిప్రాయముల నీక్రింది యొక్కపద్యములో నిమిడ్చి వ్రాసితిని, గైకొనుఁడు.

ఉ॥ కాంచనపల్లివంశతిలకం బగు నో కనకాంబ! నీకృతిన్
గాంచితి దానిలో రసముఁ గాంచితి నీవలె నిట్టికైతలన్
గాంచిన కాంచనాంగులను గాంచుటదుర్ఘటమంచు విస్మితిన్
గాంచితి నీదుభక్తి నఖండవిరక్తిఁ దృప్తిఁగాంచితిన్.

---

(కవితాభూషణ శతావధాని దోమా వేంకటస్వామి గుప్తగారు)

ఉ॥ కాంచనపల్లివంశము నిఁకన్ కనకాంబిక పేరు నల్ల బో
ధాంచితురాలిసత్కృతి సమంచిత మంచును నిర్ణయింపఁగా
నంచితుఁ డిందుశాణఫలకాకృతి వేంకట సత్కవీందుఁడే
మించె నిఁకిందు దేలఁగల మేల్మితనంబున నందియం బొకో!

---

(జయపురాస్థానకవి కవిభూషణ సెట్టి లక్ష్మీనరసింహా కృతము)

ఇంటిపేరను దనపేర హేమముగల
యట్టి కాంచనపల్లి కనకమ్మ మేలి
వన్నె కనకమ్మకవిత సువర్ణకలిత
మాపె సామాన్మట యజాకొమ్మ! యలుగకమ్మ!

---

(శ్రీజయపురాధీశ్వర శ్రీశ్రీవిక్రమదేవవర్మ మహారాజకృతము)

"జ్ఞానమును బాండిత్యమును గవితాశక్తియుఁ గల మీ యట్టి నారీరత్నములు గలుగుట భారతదేశము చేసికొన్న పుణ్య ఫలము."

---

[విద్వాన్ దర్భా కృష్ణమూర్తి, ఎం. ఏ. గారిచే రచియింపఁబడినది]

క॥ ఎలికనది హంసజయమట
పలికించినవాఁడు గురుఁడు బళి! పాలావ
జ్ఝుల నాగభూషణుఁడట
పలుకెల్లను నమృతమంచు బలుకక వలెనే

క॥ సద్గురుకావ్యం బౌట వి
యద్గంగాధార ధార, యల గాధియుఁ దా
సద్గతికిఁ బథముసూపు ల
సద్గాయత్రిసుమంత్రిసారం బౌరా!

క॥ శ్రీవ్యంబుగ ముక నుడివిన
దివ్యం బగు జీవయాత్ర దృశ్యం బౌటన్
అవ్యక్తము నవ్యంబుగ
సువ్యక్తరి నైనచొప్పు సూపట్టుఁ జుమీ!

ఉ॥ కింకవిరాజమత్తగజకేసరి బాలసరస్వతీందుప్రఁ డా
వేంకటశాస్త్రిలోనగు కవిప్రవరుల్ తలలూఁచి మెచ్చఁగా
నింకను సీకృతిన్ గుఱిచి యెవ్వరు నేమి వచింపఁగావలెన్
వంకలు వెట్టువారు మఱి వంకలు దిద్దఁగలారు నుందురే!

---

మద్రాసు విశ్వవిద్యాలయాంధ్రపరిశోధకాచార్య

[శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు]

'శ్రీమతి కనకాంబగారి జీవయాత్ర కొనియాడఁదగినది. ధర్మము, భాషాసౌష్ఠవము, పరమార్థచింత, పరమేశ్వరధ్యానము ప్రధానముగా వర్ణింపఁబడు కనకాంబగారికవిత్వము విబుధశ్లాఘాపాత్రము. అట్టి విదుషీమణి యిట్టి కవిసార్వభౌముని సత్కరించుట యెంతయు సహృదయుల కానందము.'

[కవిసార్వభౌమపారితోషికసభలో ఉపన్యాసము]

మ॥ భవదీయంబగు జీవయాత్ర కవితాపాండిత్యసద్రీతులన్
గవిరాజాదినుతంబు హంసవిజయాఖ్యానంబు నీ నాటకం
బవుఁగా భారతధర్మబోధనపరంబంచున్ నుతుల్ పొందె స
త్కవయిత్రీ కనకాంబ తద్వచనమే తథ్యంబు నే జెప్పెదన్.

గీ॥ ప్రబలపాశ్చాత్యమోహంబు ప్రబలకుండ
ధర్మసన్మార్గలక్ష్య ముదారబుద్ధి
కలుగఁ బ్రేరించు సత్కావ్యకలనచేత
కవితిలక కీర్తిశాలిని కనకమాంబ.



శ్రీ కవితిలక కంచనపల్లి కనకాంబా

# జన్మాది ప్రశంస.

( స్వయముగఁ గనకాంబగారు రచించిన పద్యములు )

ధీరుఁడు కొమ్మనార్యుని ప్రతిష్ఠను గిరితిపేరుకొన్న గుం
టూరునఁ బుట్టియుఁ జనకుఁడుఁ బిననాఁడె చనంగ వచ్చి నె
ల్లూర వసించి నేఁ జదువులుఁ బలుకంబులు సత్కవిత్వముఁ
బేరును బెంపుఁగాంచి నిటఁ బెద్దలు నన్ను ననుగ్రహింప మా
యూరిదియేయటంచుముదమొందెద శాంతయయోధ్యనుంబలెన్

మాపెద్దల్ పలునాట వాటముగ మున్మాచెర్లలో వెండి దా
చేపల్లిఁ గడు దానభోగముల వాసింగాంచు వ్యాపారులై
భూపశ్రీవిలసిల్లినారు కళలఁ భూదేవులఁ దేవులఁ
గాపాడంగఁగడంగినారు భృతులఁ గల్పించి మేలెంచుచున్.

మామాతామహులందిఱారుమునునన్మాసంబుగోల్కొండలో
హేమంబుల్ మణులుఁ సువస్తువులుభూమీశుక్ సమర్పింపను
ద్దామప్రేమ హరిఁ భజించిరి మహాత్వంబంది వేదాద్రిలో
నామం బిప్పటికిఁ వినంబడెడు ధన్యత్వంబు మా కద్దయే.

సీ॥ బాల్యంబుననె యాంధ్రభాషాకవిత్వంబు
నఱపె మఱి మంగు రామానుజుండు
ఆంగ్లవిద్యారహస్యంబు నా కెఱిఁగించె
లీలమైఁ బిదప డ్రైస్ డేలుసాధ్వి
సాంస్కృతసాహిత్యసంప్రదాయము నృసిం
హాచార్యపండితుం డవలఁ దెల్పె
విజ్ఞానసంఘముల్ వివిధపరీక్షల
బంగారుపతకాలఁ బ్రతిభఁ గూర్చె
క్వీనుమేరీకళాశాల పిదప నంబ !
యాంధ్రబోధకురా లను నాఖ్యఁ దెచ్చెఁ
బాఠ్యపుస్తకనిర్ణయపరిషదర్హ
నను యశము విశ్వవిద్యాలయంబె కూర్చె.

సీ॥ పదియు రెండవయేటఁ బలికించితివికదా
నెల్లూరు శ్రీరఁగనేతృమహిమ
పదియునేనవయేటఁ బ్రతిభఁగూర్చితికదా
నారీసభాగ్రాసనమున నిల్పి
పదియునారవయేట వారణాసీయాత్ర
చెప్పించితివికదా సీసమాల
నెలప్రాయమున లిఖియింపఁజేసితికదా
వాసి కెక్కిన మాసపత్రికలకుఁ

దరుణభావంబు రానట్టి తరుణమందె
పాండవజయంబు గౌతమపత్రిభునిచరిత
మమృతవల్లియు వ్రాయించి తెంబ! యర్థ
కాయభూషితభర్గ! యో కనకదుర్గ!

మ॥ అమృతానందగురూత్తమాంఘ్రిజలజం బాపై నఁజూపించి త
త్త్వమునెల్లఁ బ్రకటించి యాఘునునిబోధంబాస్థలోఁబద్యకా
వ్యముగా వ్రాయఁగఁ జేసినట్టి పులకాహ్లాదంబుఁగల్పింతు న్నా
య్యమకా! నీపదభక్తరాంద్రకు నసాధ్యంబేది కాత్యాయనీ!

సీ॥ ఏన్గుపై నెక్కి యూరేగి సత్కవులకు
బెట్టికూర్చినవాఁడు వేంకటకవి
ముగురువ్రాసిన వేదమును భారతము నొంటిఁ
గృతిఁజేయు సుకృతి శ్రీకృష్ణసుకవి
కృతివిమర్శకుల కగ్రేసరుం డనుఖ్యాతిఁ
గొన్నట్టి దిట్ట యా కుప్పుసామి
సర్వకళావిచక్షణుఁడు సత్కవి యన్న
కీర్తిఁ గాంచిన కాశికృష్ణబుధుఁడు
నన్ను నాజీవయాత్ర మన్ననలు నలిపి
కవితిలక మంచు న న్నెంతొ గారవమునఁ
బిలుచు నెల్లను నీకృప కలిమిఁగాదె
తనువిభూషితభర్గ! యో కనకదుర్గ!

ఉ॥ పండితగమ్యమాటను బ్రబంధమునౌటను జీవయాత్రి భ
క్తుండగువానికిఁ దెలియుఘోరణి నాటకముఁ రచించి భూ
మండలమందు సద్గురులమార్గము నిక్కలి నిల్పుటెల్ల నీ
వండగ నుండఁగాదె జగదంబిక ! సాధ్య మదేరి కన్యథా ?

చ॥ శ్రవణసుఖంబుగా నమృతసార మన న్మనముఁ హరించుచు
న్భవభయబాధఁ బాపుచును మాధవపాదసరోజచింతనఁ
దవులుచు నెల్లవారల ముదంబున నట్టిప్రబంధరాజముఁ
జవులొదవంగ నే నమృతసారము వ్రాసితి నంబ! త్వత్కృపన్.

మ॥ అమృతానందగురుఁ బరుఁ దలఁచి బ్రహ్మానందసారంబునాఁ
గమనీయంబగుగబ్బ మంబ యటు పైఁ గల్పించితిఁ దత్త్వబో
ధము జిజ్ఞాసువులై నవారలకు హత్తఁ జిత్తమం దార్షమా
ర్గమును న్దేశమునందు నిల్పు ఘనకాంక్షఁ నేటికాలంబునన్.

మ॥ భగవద్భాగవతాంఘ్రిసేవనమె మద్భాగ్యంబుగా వ్రాసి పె
ట్టఁగఁ బంకేజభవుండు లౌకికపుబాటల్ వీడి మోక్షంబు తి
న్నఁగఁ జేర్పంగల సద్గురూక్తులను డెందంబందున న్నిల్పి దీ
క్షగ సత్కావ్యములఁ రచించెదనుసాక్షాచ్ఛారదాసత్కృపన్.



## శ్రీమతి కంచనపల్లి కనకమ్మగారి స్వగృహము

# “కవితిలకకుటీరము”

(ధర్మవాది దంటు శ్రీనివాసశర్మ, బి.ఏ బి యల్, గారు రచించినది)

క॥ కవితిలకకుటీరము బ్ర
హ్మవిచారముచేయునట్టి మహనీయులకున్
కవిచంద్రు లుండుదనుకను
భువి శరణంబగుచు వెలయు మోక్షసదనమై.

---

(బ్రహ్మశ్రీ) బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారు రచించినది)

చ॥ కవితిలకాంకితంబయిన కాంచనపల్లికుటీరమందు భా
ర్గవి కొలువుండి కోడలు సరస్వతి గానకవిత్వముల్ త్రయీ
వివిధరహస్యముల్ నుడువ వించు ముముక్షులుగొల్వనంతతో
త్సవములతోడ నారవిసుధాకరతారకమున్ రమించుతన్.



విజ్ఞానచంద్రికవారి

# కనకాంబా ప్రశంస.

ఆచంట లక్ష్మీపతి, బి. ఏ., ఎం. బి. సి. ఎం.,
మేనేజరు, విజ్ఞానచంద్రికా ఆఫీసు,
చింతాద్రిపేట, మద్రాసు, ది 14—9—1912.

అమ్మా !

తా మీ సంవత్సరము మా విజ్ఞానచంద్రికాపరిషత్తు నం దందజేసికంటె నెక్కుడు గుణముల సంపాదించి యీక్రింది బహుమానములఁ బడయగలిగితి రని తెలుపుటకు మిక్కిలి సంతసించుచున్నాము. నూటికి వరుసగా సాహిత్యమునను, చరిత్రమునను, 85 83 గుణములను, శాస్త్రమునం దేబదింటికి 29 గుణములును వచ్చినవి. రొఖముగా రు 216-0-0 లును, ఆరు సువర్ణ పతకంబులును దమకు బహుమానముగా నియ్యబడును. ఆంధ్రనారీరత్నములలోఁ దమవంటి విద్యావతి యింతటి జయమును గాంచినందుల కాంధ్రలోకమంతయు గర్వపడవలసి యున్నది. ఇంకను తమవంటి నారీరత్నముల నీ భారతవర్షమున జన్మింపఁజేయ భగవంతుని సదా ప్రార్థించుచున్నాము.

చిత్తగించవలయును.

ఇట్లు,

(సంతకము) వేమూరి విశ్వనాథశర్మ, ఎం. ఏ.,
కార్యదర్శి.

## శ్రీమతి కనకాంబగారి బహుమానముల

### —• వివరములు •—

1. మొదటిబహుమతి మండలివారిది. 116-0-0

2. స్త్రీలలో మొదటిబహుమతి
శ్రీ పిఠాపురము రాణీగారిది 100-0-0

3. సాహిత్యములో మొదటిబహుమతి
శ్రీయుత వెకులి పట్టాభిరామారావుగారిది. బంగారుపతకము

4. చరిత్రములో మొదటిబహుమతి
శ్రీ రాజా నాయని వెంకటరంగారావు బహదరుగారిది బంగారుపతకము

5. ప్రకృతి శాస్త్రములో మొదటి బహుమతి
శ్రీపానుగంటి రామారాయనింగారిది. బంగారుపతకము.

6. స్త్రీలలో సాహిత్యమునందు మొదటి బహుమతి
కృష్ణాజిల్లాలో నొక జమీందారుగారిది. బంగారుపతకము.

7. స్త్రీలలో చరిత్రమునందు మొదటి బహుమతి
కృష్ణాజిల్లాలో నొక జమీందారుగారిది. బంగారుపతకము.

8. స్త్రీలలో శాస్త్రమునందు మొదటి బహుమతి
కృష్ణాజిల్లాలో నొక జమీందారుగారిది. బంగారుపతకము·

శ్రీకృష్ణభూషణుం డను నామాంతరము కల శ్రీమాన్

# అమృతానందనాథ స్వామి ప్రశంస.

[ దుర్భా సుబ్రహ్మణ్యశర్మ కృతము ]

నే బద్ధుండను మోక్ష మెట్లనుచు భ్రాం
తిన్ బోయి నేవేఁడగాఁ

దా బహ్వాకృతినేను లేమియును ద
త్త్వం బొక్కఁడే యున్కియున్

వే బోధించి యహంకృతిన్ వదలిచెన్
విద్వత్తముం డెవ్వఁ డే

నా బ్రహ్మణ్యుని గృష్ణభూషణవిభున్
ధ్యానింతు నశ్రాంతమున్.

సంశయము బాఁపి కరుణ మోక్షంబుఁ గూర్తొ
కాక భవపాశములనిట్టి కట్టినైతో
యేమి కానున్నదో యీశ్వరేచ్ఛ యెట్లో
యెట్టులైనను నీవాఁడ నేను నిజము.

శ్రీ భాష్యాయ నమః

# ఆనందసారము



ధర శంకర విబుధా
రాధితరామేశ! భక్త◆రంజకవేషా!
బోధస్వరూప! వేంకట
నాధా! గురుమూర్తి! శరణు ◆ నానాధారా! ౧

గీ॥ విఘ్ననాథుని, పార్వతీ◆విశ్వనాథు
గోపికానాథు, గురునాథు, ◆ గూఢపాదు
భారతీనాథు, వేంకట◆ప్రాణనాథు
బ్రహ్మమయులని భావించి ◆ ప్రస్తుతించి
పరమభక్తిని భజియించి ◆ గురువరేణ్య!
మేము నీకృప నిల్చియు◆న్నాము కృష్ణ!
ఆత్మమయత నిట్లిదిగో ధ◆న్యాత్మ లగుచు
దేవకీవసుదేవనం◆జీవనంబ! ౨

సీ॥ భక్తరక్షణమునఁ ◆ బ్రాలుమాలిక లేమి
నాదినారాయణుఁ ◆ డని భజింతుఁ
దత్త్వబోధముఁ జేయు◆తరి జ్ఞాననేత్రుఁడౌ
సాక్షాచ్ఛివుం డని ◆ సన్నుతింతు

శిష్యతతికి మహా♦భాష్యంబుఁ జెప్పువో
నల పతంజలియ యం♦చభినుతింతు
నుపమానముల యుక్తి♦యుక్తమౌ సూక్తులఁ
గాళిదా సని భక్తిఁ ♦ గేలుమోడ్తు
మద్గురుస్వామి సాహిత్య♦మార్గదర్శి
సకలశేఖరు సత్యంత♦శాంతమూర్తిఁ
బరమకరుణాళు నమితవి♦శ్వాసపరుని
భోగి సర్వపరిత్యాగి ♦ రాగి యోగి. 3

ఆ॥ వె॥ భక్తవరులఁ గూర్చి ♦ పలువేషములఁ దాల్చఁ
దెలియ పెట్టు లెట్లొ ♦ పలుకుచుండు
గాని వాని కెందుఁ ♦ గైవల్యమై యుంట
నిత్యమంగళుండు ♦ నిఖలవిదుఁడు. ౪

క॥ భరియింపరానికష్టము
లరయ నవస్థాంతరంబు ♦ నతిశీఘ్రముగా
నరులకుఁ గల్పించును శ్రీ
హరిచ్ఛ నూరకయు నట్టు ♦ లోఁ జిత్రగతిన్. ౫

ఆ॥ వె॥ తన కొకఁడు సహాయ♦మును జేయనేరఁడు
పట్టిప్రాకులాడు ♦ పట్టిభ్రాంతి
గిట్టిభక్తిలోనఁ ♦ బుట్టఁజేసినవాఁడు
హరి యొసంగును సక♦లార్థసిద్ధి. ౬

ఆ॥ వె॥ కాన నీశ్వరేచ్ఛ • కై వేచియుండుట
దొరల కుండు కొంచ • దొడ్డబుద్ధి
కామధేను వదియ • కలవానిఁ జేయంగఁ
బూర్ణదీక్ష దానిఁ • బూను టొప్పు. ౭

కం॥ దీనుండై హీనుండై
మానవులన్ సేవఁజేయ • మఱగిన పిదపన్
మానము వీడిన నీచున
కౌనె సులభశైలి విడిచి • హరి భజియింపన్. ౮

ఆ॥ వె॥ మాట లెందునుండి • మఱలుచుండును, దేని
మనసు చేరలేదు, • వినుమ! యట్టి
యాత్మయై వెలుంగు • నతనివిషయ మంతె
గాదె! తద్భజనము • జ్ఞానధనము. ౯

కం॥ అంతయు బ్రహ్మం బనుచోఁ
జింతకు నెడ మేది? మనమ! • శ్రేయోవృద్ధిన్
గాంతువు, శాంతిని నటుపైఁ
గాంతువు, సర్వార్థసిద్ధిఁ • గాంచెద వవలన్. ౧౦

కం॥ జీవేశ్వరజగములు లే
వేవిధిఁ బరికింప దేవుఁ•డే యని తెలియన్
భావం బట్టటు నిలుచుట
కేవలతత్త్వంబు రామ•కీర్తనము సుమీ! ౧౧

గీ॥ ఆత్మ యేకంబు నద్వితీ♦యంబు నగుట
నిత్య మానంద మగును, సం♦దేహ మేల?
చిత్రమూర్తిఁ దాల్చునెవలఁ ♦ జేవ చెడక
సర్వమును బ్రేరణముఁ జేయు ♦ జంతుల కెఁక
స్వాత్మపోషించు శ్రమ మేల ♦ సతత మిట్టి
శ్రీగురూక్తులఁ దెలిసి ని♦శ్చింతనొయిని
నమ్మి శాంతించి శ్రీహరి ♦ నెమ్మనమున
భక్తి భజియించువారికిః ♦ బరమపదము! ౧౨

క॥ పలుభంగులసంకల్పం
బులు కలుగఁగ లెక్కసేయఁ♦బోకుము జీవా!
కలదానివాచకం బది
కలకాలముఁ బ్రణవ మూఁతఁ ♦ గావింపు మొగిన్. ౧౩

క॥ సకలేంద్రియములతోఁ గను
నొకఁడై యానంద మాత్మఁ ♦ డూరక యేలా
వికలత నుడివడ మనసా!
సకలము బ్రహ్మంబు తెలియఁ♦జాలినఁ జాలున్. ౧౪

గీ॥ సకలమతసారసంగ్రహ♦సత్ఫలంబు
శాంతి యది కల్గ జమ్ము ని♦శ్చింత నిలువ
నట్లు నిల్చుట తత్త్వంబు ♦ సరయుమిదవ
స్వస్వభావంబుఁ దెలుప నీ♦శ్వరుఁడు గురుఁడు. ౧౫

గీ॥ భర్తృతేజంబు భార్యాగ•ర్భంబునుండి
బయలుపడుచుండుచందాన • బ్రహ్మసార
మద్ది గురుముఖమున నుండి • యవతరింప
విన్నదానినిఁ దలఁదాల్చి • విహితవృత్తి
నున్న నున్న దున్నటు గందు • రుత్తము లిల. ౧౬

క॥ ద్వేషము రాగము లేకయు
వేషంబున కొప్పునట్లు • వివిధగతుల సం
తోషంబున నటియించిన
దోషంబే! సూత్రధారు•తో నైక్య మగున్. ౧౭

క॥ జీవన్ముక్తుం డవ్విధిఁ
గేవలచిన్మూర్తిఁ దాల్చి • క్రియల నడుపుచో
దేవునితో నైక్యంబున
ధావనమొనరించుఁ గద! ప్ర•ధానము భంగిన్. ౧౮

క॥ ఉన్నది వెలిలోఁ దోఁచుచు
నున్నది జగమట్లు తోఁచు•చున్నది యొక్కఁడై
యున్నది తోఁచుటయు న దని
కన్నఁగ గురుసూక్తి దాని•కన్నఁగ గలదే? ౧౯

క॥ జీవునివలెఁ దద్యత్నము
కేవల మాభాన వినాశు • క్రీడ యొకండే
కేవలునిం బలె నత్యము
కావునఁ గేవలకృప మముఁ • గావఁగ వలయున్. ౨౦

క॥ ఆదిమరూపము హరికై
యాదిమకారణము సృష్టికై నది నానా
నాదాత్మక మోంకారము
సాధులలోఁ బ్రణవసంజ్ఞ ♦ జరగు న దేలా? ౨౧

క॥ నానాత్వం బేకత్వము
జానగు శాశ్వత్వ మాత్మ ♦ సత్యత్వంబుఁ
బూని శుచిత్వము సిద్ధం
బా నాదిమిథునము ప్రణవ ♦ మన బ్రహ్మంబే ౨౨

క॥ కేవలుఁ డశరీరుఁడుకద,
కైవల్యము వానికీడ్పడఁగద, కర్మ మనఁగ
జీవునకు సిద్ధమిథునము
నేవేళ భజించుచుంట♦యే ముక్తికదా! ౨౩

క॥ జీవునివలెఁ దోఁచుచుఁ దా
దేవుండై యుండుదానిఁ ♦ దెలియు మహా మ్మం
చేవేళ సోహ మని నా
సావివరములందు నద్ది ♦ జపియించుఁగదా! ౨౪

గీ॥ గిన్నె యన్నది రజతమై ♦ యున్నభంగి
విశ్వ మన్నది బ్రహ్మమై ♦ శాశ్వతముగ
నున్న దవ్విధి యహ మన్న ♦ దున్న దౌర!
యది సనాతన మని సోహ ♦ మనుట తెలుపు
హంసతత్త్వంబుఁ గన్గొను ♦ హంస నిజము ౨౫

క॥ ఆవిధమున నీరూపము
శ్రీవల్లభ జగ మటంచు ♦ శ్రితవత్సలతఁ
నీవే శ్రుతివై తెల్పఁగ
జీవుఁడు వేఱొక్కఁడిక్కఁ ♦ జిక్కఁ న దేలా ?　　౨౬

క॥ దేవా ! మా కీశంకల
తో వేళఁ గడప నేల ? ♦ తోడ్తో సర్వం
బీ వని గొల్చిన నీవై
రావలసినయద్ది మాకు ♦ రా నిత్తు హరీ !　　౨౭

ఉ॥ యత్నములేకకల్లు సక♦లార్థములుత్తమముల్ గ్రహింపనా
రత్నములట్ల సాన నిడి ♦ రమ్యతరంబుగఁ జేయవచ్చు న
ద్యత్నముతోడ వానినియ♦థార్థములొంటఁగదా వృథానుమీా
నూత్నముగాసృజించుకొన♦నొచ్చుటసర్వము సిద్ధమాటచేన్.

## ఉత్పలమాలిక.

ఇచ్చును బాలుతల్లి మొద♦లిచ్చును మేఘుఁడును న్నదుల్ జలం
బిచ్చును సస్యవృద్ధి నిల ♦ యిచ్చు ఫలంబుల వృక్షరాజిఁ దా
నిచ్చును సచ్చరిత్రుఁడు స♦నేకముఖంబుల బోధ మారి ! యీా
యిచ్చిన వన్నియుఁ దనివిఁ♦నీయ వదేలొకొ ? నీకు జీవ ! ఛీ !
మ్రుచ్చిలఁజొచ్చెదాత్మఁగని♦మూలధనంబదియుఁ గ్రమంబుగా
నిచ్చును లెస్సర క్రమము, ♦ హేయఁపురొంపియు, లోహజాతమే

యచ్చపురాళ్లు, నొక్క-పెయి • నాఁకలిఁదీర్పఁగలేనివయ్యెరో
నిచ్చలు గాధఁజొన్ను నవి • నీళ్లెడుదాఁకనివేల భక్తితోఁ
బుచ్చుముకాలమీశ్వరునిఁ • బొందెదు పేదుక మంత్రరాజముఁ
జెచ్చెరనుచ్చరింపుచును • శేషవిభూషణునాశ్రయింపుచున్. ౨౯

క॥ భజనము మాపని యనియు, వి
భజనము గా దంచుఁ దెలుపు • భక్తుల విని న
మ్ము జనుఁడు భవముఁ దాఁటు, గు
రుజనములఁ భక్తిఁ గొల్చి • రూఢి నెవండేన్. ౩౦

ఆ॥ వె॥ ఏల వచ్చితి నిట • కెవ్వండు నావిభుం
డేమి సేయవలయు • నెద్ది దిక్కు-
టంచు నార్తిగుఁడు • నాబ్రహ్మ కెవఁడు ముఁ
దెలిపె సర్వ మతఁడు • తెలుపు మనకు. ౩౧

ఆ॥ వె॥ కాన నతనిఁగూర్చి • గాథానురక్తితో
శక్తికొలఁది మెట్టి • చాలపెట్టి
వలనుపడక తుదకు • వైరాగ్యమునఁ గాష్ఠ
మట్టు నిలువ హారియ • యుట్టిపడఁడె. ౩౨

గీ॥ అఖిలమందు సోహ • మను విలాసముఖంగిఁ
బ్రకృతి యంతరాత్మ•ప్రకటనంబుఁ
జేయు నాకృతి యిది, • సిద్ధసంకేతంబు
అర్థ మరయఁగఁ బర•మాత్మ సుమ్ము. ౩౩

సీ॥ రామతాదాత్మ్యంబు ♦ కామింపఁ గలనాఁడు
కామింపఁదగినది ♦ కలదె భువినిఁ
కృష్ణతాదాత్మ్యంబు ♦ నిచ్చగించిననాఁడు
నిహమందుఁ గల దెద్ది ♦ యిచ్చగింప
బ్రహ్మానుభూతినిఁ ♦ బడయఁగోరిననాఁడు
భువినిఁ గోరఁదగిన♦భూతి కలదె
ఆచార్యకృపచేత ♦ నాత్మవిద్య లభింప
నానంద మన్యత్రి ♦ యరయఁ గలదె
నిన్ను మరగిన మానసేం♦ద్రియము లెట్లు
చీఁటికిని మాటి కితరంబుఁ ♦ జేరనేర్చు
ముక్తియందేని మోహంబు ♦ పుట్టదన్న
రామ శ్రీరామ శివరామ ♦ రామకృష్ణ! ౩౪

గీ॥ తెలియ మనుకొనువారలె ♦ తెలిసికొంద్రు
తెలిసికొంటిమి యనువారె ♦ తెలియకుంద్రు
అనుకొనుట యాట రెండు ను ♦ మ్మనుభవమున
నుండి కాని దనుకొనుచు♦నుండు నిజము. ౩౫

గీ॥ నిత్య మాత్మానుషంగస♦న్నియతి నుండు
జీవుఁ డవ్విధిఁ బరలోక♦చింతఁ గుండు
నాత్మమిథునంబు క్రీడించు ♦ నవసరమున
నితరులును రారు వారు ♦ రానీరు వారి. ౩౬

క॥ తన ప్రతిబింబము దిద్దఁగ
జనుఁ డెంతే యత్నపడిన • జరగున యది తా
తనదేహబింబమందున
నొవరిచి యద్దమునఁ గనఁగ • నొప్పార మార్పున్. ౩౭

క॥ తనరూపము తన కగపడుఁ
దను దా శుద్ధుండు గాఁగఁ • దద్రూపంబే
గని నగుఁ దన దగు జగ మటు
కనుకన్ దనలోన మార్పు • గావలె నరయున్. ౩౮

గీ॥ దృశ్యకా నట్టివానికి • దిక్కు లేదు
సత్య మరయంగ శాశ్వత•సౌఖ్య మరయ
మోహమున మున్గ ముంచంగ • మూఢవితతి
కూహచేఁ జేయఁ జాలిన • దూఁకదంపు. ౩౯

ఆ॥ వె॥ కామరహితమైన • కర్మంబు గలవోటఁ
గారణంబు లేని • కరుణ గలదు
భక్తుఁ డెఱుఁగు నెఱుఁగు • భగవంతుఁ డన్యుల
కంతయు నొకరీతి • వతిశయోక్తి. ౪౦

క॥ ఇన్నియు గురుముఖమునఁ దాఁ
గన్నన్ లోకంబుఁ గనఁగఁ • గాంక్షించు నొకో
తిన్నఁగ స్వస్థుండై సం
పన్నుండై మించుఁగాక ! • పన్నగభూష ! ౪౧

క॥ కలవారికెల్ల నెందుఁ
గల సకల మహాంపదార్థ◆గతసత్త్వం బన్
గలమాట విందు విటు కవఁ
గల యీ ప్రతిబింబ మాత్మఁ ◆ గల బింబముదే. ౪౨

క॥ మును దా నజ్ఞానంబున
జనియించిన మగఁడు లేఁడు ◆ జనకుఁడుసుమ్మా!
మును దా నజ్ఞానంబున
జనియించిన జీవుఁ డేఁడి ◆ శౌరియ సుమ్మా! ౪౩

క॥ అంతయు బ్రహ్మం బను నసి
శాంతిదమన్ బెండ్లియాడ ◆ నకలేంమ్రిలకై
చింతామూలముఁ ద్రుంపఁగ
వింతఁగఁ గంకణముఁ దాల్చు ◆ విప్రులలోనన్. ౪౪

గీ॥ చేతనంబైన నేమి య◆చేతనంబ
యైన నేమి భేదంబు చే◆యంగ రాదు
సర్వమున రామచైతన్య◆శక్తిలేదె
ప్రేరణముచేయ లోన ◆నభేదగతిని. ౪౫

క॥ జ్ఞానాజ్ఞానంబులు త
త్త్వానుభవప్రాప్తు లరయ ◆ నానందము దుః
ఖానలమున్ గలిగించును
జ్ఞానానుభవములవలనఁ ◆ గద మోక్షంబున్. ౪౬

గీ॥ అంతయును బ్రహ్మ మనుచు న♦త్యంతభక్తిఁ
గొలుచు మా కేల మీమాంస ♦ వలుకఁబూన
ధర్మధర్మివియోగంబునఁ ♦ దనరుచుంట
మాకు ధర్మంబు మీమాంస ♦ మత్సరంబె. ౪౭

క॥ ఎవరికిఁ దగినది వారికిఁ
గవికూర్చెన్ బ్రహ్మ బుద్ధిఁ♦గను నిత్యంబున్
శివశివ! స్వాహంకారము
లవమేనియు వానిచర్య♦లన్ లేదు సుమా! ౪౮

గీ॥ దేని కెది యెట్లు యుక్తమో ♦ దాని కట్లు
చేయు న్యాయాధిపతిఁ జేరి ♦ జే యొనర్తు
తా నహంకృతి దానిలోఁ ♦ దగులుకొనిన
ముప్పు నిజ మని రాజాజ్ఞ ♦ చెప్పఁగాదె. ౪౯

క॥ జరిగినదానివిచారణ
జరుగఁగ నున్నట్టిదాని♦చర్చయుఁ గలియన్
జరిగెడు ముహూర్తలక్షణ
మరయఁగ నవి రెండు లేమి ♦ నానందంబౌ. ౫౦

ఆ॥ వె॥ ఆత్మ నీశ్వరునకు ♦ నర్పణం బొనరించు
భక్తశేఖరులకుఁ ♦ బ్రజ లొనర్చు
పుణ్యపాపసమితి ♦ పురుషోత్తమున కౌటఁ
దత్తదుచితఫలము ♦ తప్పకుండు. ౫౧

ఆ॥ వె॥ ఊరకున్న భక్తు • నుచ్చస్థితిని నిల్పు
స్వస్వరూప మిచ్చి • సాఁకు స్వామి
యత్నపడెడువాని • నాకాశమునఁ ద్రిప్పు
నాశపెంచుఁ ద్రుంచు • నాత్మశాంతి. ౫౨

గీ॥ సహజసద్గుణమూర్తియై • సంతతంబు
స్వస్వరూపానుసంధాన•సమయమందు
విశ్వరూపంబుఁ దాల్చెదు • నీశ్వరునకు
నీకు జీవుల కొకరీతి • నిశ్చయముగ
నంటియును బ్రహ్మ మన్యం బొ•కింత లే ద
టంచుఁ దెలిసిన యప్పుడే • యవధిగాన
మాకు నీతోడియైక్యంబు • మంగళంబు
జీవసంజ్ఞశక్తి శివుండు • జీవుఁడౌట
కోర నేటి కన్యంబు సం•కోచ మేది. ౫౩

క॥ అనుభవసమయంబందున
ఘనయోచన శ్లాఘ్యకరము•గద పరికింపన్
అనుభవవిరహితయోచన
తను భవబంధంబునందుఁ • దగులన్ జేయున్. ౫౪

క॥ అనుభవముతక్క యోచన
గనరా దాత్మజ్ఞునందుఁ • గర్మము ధ్యానం
బును వాక్కు సమాధి సజం
డనుసంధించినప్రకార • మతఁడై వెలయున్. ౫౫

గీ॥ వట్టినన్నాయినోక్కులు ♦ కిట్ట వెందుఁ
జెవికిఁ బరువంబుగాఁ దోఁచు ♦ సిద్ధ మరయ
కుత్రిరియుఁ దగురీతిఁ దోడైన ♦ శోభఁ గాంచు
వట్టిరోచన యివ్విధి ♦ వలనుపడదు. ౫౬

ఆ॥ వె॥ నిలువఁబడుల స్త్రీకి ♦ నింద్యంబు కార్యార్థ
మైన మే లటండ్రు ♦ దాని నట్లు
వట్టిరోచన కొడి♦గట్టకుండినయెడ
జీవుఁ డనుభవమున ♦ దేవుఁడ కద! ౫౭

క॥ అనుభవ మర్థము ప్రాణం
బును వస్తువు లేకయున్నఁ ♦ బొల్లగుఁజుమి రో
చన, పదము, దేహ, మాకృతి
యనయముఁ దద్యోగగరిమ ♦ నానందదముల్. ౫౮

ఆ॥ వె॥ అనుభవించుచున్న♦యర్థంబు విడిచిన
రోచన యది దుఃఖ♦సూచకంబు
అనుభవార్థమంగు ♦ నదియుఁ గర్మబ్రహ్మ
మందు రైక్యసిద్ధి ♦ మైన కలన. ౫౯

ఆ॥ వె॥ మాటి కాదుచుండు ♦ మాటాడఁగా నాల్క
యూరకాడఁజేయ ♦ నోగు నిజము
ఈవిధంబుగాదె ♦ కేవలవాసన
యనుభవరహితమయి ♦ యార్తిఁ దెచ్చు. ౬౦

కం॥ శాస్త్ర యోచన మానుట
యానందమహాబ్ధి నోలలాడుట ధ్యానం
బూని చరించుట నెటులే
మానంబున నుంట భక్తిమార్గము కృతికిన్. ౬౧

ఆ॥ వె॥ జీవుఁ డాత్మ మఱచి ♦ సిద్ధంబు శూన్యుఁడై
జీవనంబు లేమిఁ ♦ జింతఁ గుందు
జీవుఁ డాత్మఁ గూడ ♦ దేవుఁడై విలసిల్లు
నేల విడిచి సాము ♦ వీలుపడదు. ౬౨

ఆ॥ వె॥ ఈశ్వరుండు నామ ♦ మీశేచ్ఛ క్రియగాఁగ
నతనిరూపు జగమె ♦ యై వెలుంగ
మూటిలోన నైన ♦ మూఁడుదాఁటిన నైన
మూఁడెయైన విష్ణుమూర్తి నుమ్ము! ౬౩

కం॥ అంతయు బ్రహ్మము సిద్ధం
బంతయుఁ దద్రూప మిద్ది ♦ యాలోచన యా
వంతయుఁ గా దది నా దని
శాంతించి స్మరించు నిన్ను ♦ సాధువు రామా! ౬౪

ఆ॥ వె॥ నీగురుండు మంచినేర్పరి గాఁ డయ్యా!
నాగురుని భజించు ♦ నాఁగ రాదు
నీసుతుండు తగఁడు ♦ నీరాజ్యపదవికి
నాసుతుఁడ కావఁగు మనంగఁ దగునె? ౬౫

ఆ॥ వె॥ నిజగురుండె గాదె ♦ భజనీయుఁ డెల్లిన
నెవరి కే స్వధర్మ ♦ మెంతయుఁ దగఁ
బాటుపడఁగరాదు ♦ పరధర్మమున కెందు
స్వార్థమునకు నెటు పరార్థ మీాదు. ౬౭

ఆ॥ వె॥ స్వార్థ మంగి గాఁగి ♦ వంగంబు తోఁ బర
ధర్మము లవి గవ స్వధర్మ ములగు
వాని ననుసరింప ♦ నర్థిల్లు స్వబలంబు
దాన లేదు సుమ్మి ♦ ధర్మహాని. ౬౮

ఆ॥ వె॥ భక్తవరులగతులు ♦ బహువిచిత్రములు చూడ
నీశుస్థితియు నొకఁడ ♦ యెంచిచూడ
సకలభక్తవరులు ♦ సామరస్యముఁ గాంత్రు
స్వానుభూతియే ప్రమాణ మగుట. ౬౯

ఆ॥ వె॥ తెలిసి యాడుచుండు ♦ ధీరుండు లీనమై
తెలియ కేడ్చుచుండు ♦ నిలను జడుఁడు
కాని యిరువురకును ♦ గల్గు నానంద మా
యాట ముగియు పిదప ♦ నది నిజంబు. ౭౦

ఆ॥ వె॥ ఆటకొఱకుఁ బుట్టు ♦ నాద్వంద్వములఁ జూచి
మంచిచెడ్డ లూర ♦ కెంచ నేల
పుట్టులేనివాఁడు ♦ పుంఖానుపుంఖంబు
గా జనించు విష్ణుఁడే జగంబు. ౭౧

కం॥ అడుగనివానికిఁ జెప్పఁగ
బడనేలా పలుగాకులను ♦ బాధల జీవా!
దుడుకుతనం బిఁక మానుము
కడఁకన్ విడువందు కాంక్షఁ ♦ గలవాఁ డెల్లన్. ౨౦

గీ॥ బాగుపడనివారిఁ ♦ బట్టి ప్రాకాడినఁ
బలుక వినరు తెలియఁ♦బలుక వశమె
ఆకలంబు నాశ ♦ నా కేల హరిహరి!
శ్రీనివాసుఁ డట్లు ♦ వారిఁ జేయ. ౨౧

కం॥ ప్రారబ్ధంబున జీవులు
ధీరులు భీరులును నగుట ♦ తెలిసియు నేలా!
వారిని వీరిని నెంచుట
యౌరా! యన నదియు రాము♦నాజ్ఞయ యనరే. ౨౩

శా॥ కానన్ జర్చలఁ గట్టిపెట్టు మిఁక న♦క్కంజాక్షు సేవింపుమా
వానిన్ వీనను గాల మేల జన స♦ర్వం ఖల్విదం బ్రహ్మ యన్
జ్ఞానంబున్ మది నిల్పి నిల్వుమొకచోఁ♦గర్మానుసారంబుగా
మానంబున్ దగఁదాల్చి భక్తులకు స♦న్మార్గంబు సూచింపుచున్.

కం॥ కోట్లకొలఁది ధనమును బలు
పాట్లు పడుచు నేకరించి ♦ పలుమఱు కన్ జీ
కట్లం గ్రిమ్మఁగ నీయా
చోట్లన్ సంచార మేల ♦ చూడుము నీలోన్. ౨౪

క॥ ముందంజ వేగ వేయుము
సందడి యెంతైన వెనుక ♦ చాయఁ గని మర
ల్పం దగదు దృష్టి నదియే
పొందుగ బ్రహ్మానుభూతి ♦ పూర్ణప్రీతిన్. ౨౬.

క॥ ఆత్మార్పణముం జేయు మ
హాత్మునికిఁ నిత్యశాంతి ♦ యానందము, ము
క్తాత్ముండే నిజముగఁ బర
మాత్మవిచారణ మిఁకేల ♦ యనిశ మవశతన్. ౨౭

క॥ భేదజ్ఞానము మూలము
మోదంబున కట్లు భేద♦మున కా రెంటన్
లే దాత్మానుభవం బని
కాదే కరుణయె రస మని ♦ కవు లందు రిలన్. ౨౮

క॥ కరుణయు శృంగారరసము
ధర మాయామాత్రములుగ ♦ ధన్యుఁడు గని శ్రీ
హరి స్వాత్మభూతిఁ గాంచును
దరియించును లేఖ శ్రీనిఁ ♦ దనను దపమునన్. ౨౯

క॥ ఈ రెండు వియోగంబునఁ
గారణముం గాంచుఁ గాంచుఁ ♦ గార్యం బటులే
ధారుణి యోగంబున నే
ధీరులు రెంటిని మృష యని ♦ తెలియుదు రాత్మన్. ౩౦

క॥ విరహమునఁ గరుణరస మగు
విరహార్తి హరించు రామ•విభుయోగమునన్
విరహం బెఱుఁగని యోగం
బరయఁగ శృంగార మదియు • నడఁగు సమాధిన్. ౮౧

క॥ రము ధాత్వర్థం బెఱిఁగిన
ప్రముఖులు శృంగారకరుణ•రసభేదంబుల్
గమనింతురె భ్రమ ముంతురె
తమయాశ్రయమందు భక్త•తతి శ్రీరామా! ౮౨

క॥ నామాకృతులను గృతులను
గామింతురు సామ్య మెంత•కష్టం బకటా!
రాముం డొకఁ డయ్యు జగము
గా మారిన యపుడు చిత్ర•గతి విహరించున్. ౮౩

క॥ కుశలప్రశ్నం బుపకృతి
విశదం బగు నాత్మధర్మ•విద్యాభ్యాసం
బశనాదు లింద్రియంబులు
వశవర్తులు గాఁగఁ దపము • వలయు సుకృతికిన్. ౮౪

క॥ నిజధర్మము భజియించుట
భజియింపమి ద్వంద్వసమితి, • భగవంతుని లో
భజియిౕచుట, గురుసూక్తిన్
భజియించుట యాత్మతత్త్వ•భజనము కాదే! ౮౫

ఆ॥ వె॥ తోలుబొమ్మలాట • లీలఁ బో నీ కేల
పట్టిపాత్రికలాడ • భయము భ్రాంతి
విడిచి, స్వస్వరూప • ముమగకుండుము చిన్మ
యుండవై వెలుంగు•చుండు దీవు. ౮౬

క॥ భేదము తోఁచనిదో నీక
నేది జగ మంచు దాన • నేదీ క్రీడా
మోదం బాత్మకు వృధగా
వాదం బది యేల జీవ, • వాంఛ గలిగియున్. ౮౭

క॥ నియమము వర్జించిన నాఁ
డయయో! గుణదోష మెట్టు • లారయఁగల మఱ
భయ మించుకేని లేక గ్ర
హించు సర్వంబు నెట్టు•లేఁ బశుభంగిన్. ౮౮

క॥ కృతిశైలి ప్రకృతిశైలియు
మతిమంతుం డరసి శుద్ధ•మానంబునఁ దా
మతిలేక గతుల న•న్నిట
నతిధీరత నిల్చుఁ గెల్చు • నాత్మస్థితిచేన్. ౮౯

క॥ ఆదర మొప్పఁగ ము న్నా
వై దేహి వరించినట్లు • భక్తవరుల్ ధీ
రోదారు రామచంద్రుని
మోదంబునఁ జేర్తు రాత్మ • మును లశరీరుల్. ౯౦

క॥ జ్ఞానానందాబ్ధిని బ్ర
హ్మానుభవం బున్న భక్తు • లటు నిటు నరయన్
బానినఁ బానకయున్నన్
బాన రహంకృతియలేమిఁ • బూర్ణులు రొంటన్. ౯౧

ఆ॥ వె॥ ఒక్కబీజమందుఁ • బెక్కుశాఖలు పూలు
పల్లవంబులట్లు • ఫలచయంబు
కల్గుచుండురీతిఁ • గమలాక్షుఁడే యగు
బీజ మీభ వనగ • మోజఁ గలుగ. ౯౨

ఆ॥ వె॥ ఒక్కరాజులోన • నున్న రాజత్వంబె
పెక్కుసేవకులను • బెక్కువిధుల
తోడఁ గలుగఁజేసి • తోడ్తోడ వేర్వేరు
గతుల నుండు తా నొ•కండు గాదె. ౯౩

గీ॥ అనికి నఱుగనివానిధై•ర్యంబుఁ బోలెఁ
గావ్య మెఱుఁగనివానివ్యా•కరణమట్లు
వైద్య మెఱుఁగని మందుల•పగిది నెందు
భక్తిలేనట్టి జ్ఞాన మ•బద్ధ మంచుఁ
గలుగు లోకోక్తి యద్దాన • నలుగకుండ
రామ! వైకుంఠధామ శ్రీ•రామరామ
నీకు మంగళ మెప్పుడు • మాకులంబు
నందు నగుఁగాత మాకు నా•నందకంబు. ౯౪

గీ॥ అంతరింద్రియనిగ్రహ • మమరు దాఁక
నిష్ఠనియమంబు లేకయే • నిలువదండ్రు
అవల తన్మయత్త్వాన బ్ర•హ్మంబుఁబోల
దేశకాలాదిభేదంబు • లేక మున్న. ౯౫

క॥ ఆవరణరహితమైనది
కేవలబ్రహ్మంబు దాని•కి సదానందం
బే వీర్య మన్య మెఱుగమి
నీవు న్నే నేడ స్వాత్మ•నిష్ఠఁ నృహరీ. ౯౬

క॥ నీ వే నాదిగ భేదము
జీవుఁడు కల్పించి రామ•సేవాపరుఁడై
యావరణరహితుఁడై తను
దా విడు ద్వంద్వంబు జీవ•తఁ గురుకరుణన్. ౯౭

క॥ బీజము నిజమై వృక్షము
నోఁజఁ బుట్టించు వి•త్తై యుండినఁజాలుఁ
బీజము వృక్షము సర్వం
బోఁజఁ జరింపవలె నఁ•హో కాకున్నన్. ౯౮

ఆ॥ వె॥ వట్టిమాటలట్లు • వైరాగ్యమే లేక
పూర్ణబోధ మెట్లు • పుట్టఁజేయు
మాటమీఁద మాట • నోటితోఁ జరించి
జాతి నీతి లేక • జడుఁడు బ్రదుకు. ౯౯

క॥ కావఁగ వృత్తి నశించినఁ
దానే బ్రహ్మంబు కానఁ ♦ దథ్యము కను నా
త్మానంద మన్నివిధములఁ
బూనుఁగ జిన్మద్రి జన్మ♦ముఁగ దరియించున్. ౧౦౦

క॥ ఉన్నది బ్రహ్మం బొక్కఁడె
యున్నఁగ గలమైన పిదప ♦ నానందముతో
నున్నఁగ సాధులఁ గన్నఁగ
విన్నఁగ దచ్చరిత లంటు♦నే భవ మొందున్. ౧౦౧

క॥ కరుణించి బోధచేయుచు
నరులఁగ సన్మార్గమందు ♦ నడిపెద ననుచుఁగ
గరివరదు మఱచి తిరుగుట
పరమార్థము నేటిదీన♦బంధుల కకటా! ౧౦౨

క॥ తాఁ దరియింపఁగ మార్గం
బేదో యొకఁ డరయు సాధు ♦ విహాపరములకుఁగ
మోదావహ మది తన కని
బాధింపంజూచు వేద♦బాహ్యం బొరులన్. ౧౦౩

క॥ కొందరు మందరలై మఱి
కొందఱు వానరులు గాఁగఁ ♦ గుదురుగ నిలిచెఁగ
డెందము భగవద్భక్తుల
యందున స్వాత్మానుభూతి ♦ నానందమునన్. ౧౦౪

క॥ ఎన్నివిధంబుల దానం
పన్నుండై యున్న నేమి ♦ పరమానందం
బన్నది కనఁగలఁ డానరుఁ
డన్నా! యీశేచ్ఛ యతని ♦ నటు చేయనిచో. ౧౦౫

ఉ॥ కావున నీశ్వరేచ్ఛకయి ♦ కాచుకొనుఁగా గురువాక్యపద్ధతిఁ
గేవలపండితుం డొకఁ డ♦కిల్బిషవృత్తినితాంతభక్తిమైఁ
గావరముఁగా హరించుకొని ♦ గాఢతపశ్చరణంబు మానియై
శ్రీవిభుఁగూర్చినల్పునని ♦ చెప్పుచునుందురుధన్యులిద్ధరన్.

క॥ జీవుఁడు నిజకర్తృత్వము
భావించుట విధినిషేధ♦భాక్త్వ పొసఁగన్
గేవల మాత్మార్పణమునఁ
గైవల్యం బందు సర్వ♦కార్యములందున్. ౧౦౬

క॥ ప్రాయశ్చిత్తశతముల న
పాయముఁ జెందు నొకొ పుణ్య♦పాపఫలంబుల్
న్యాయంబుగ నాత్మార్పణ
మే యొక్కఁడు వానిఁ ద్రోచి ♦ హితమొనఁగూర్చున్.

క॥ ఉన్నది లేదన జెల్లున
యున్నది హరి యతనిలీల♦యుగా గద యనువాఁ
డెన్నం డెద్దియు వానికి
నున్నదె మఱియొక్కఁ డాత్మ♦యోగము దక్కన్. ౧౦౭

## ఆనందసారము.

క॥ నానాక్రీడాసక్తిన్
దా నాడినయట్టు లుండుఁ • దగ హారి [illegible]
కానే శంకించుట యభి
మానము మానంగ సకల•మంగళములకున్. ౧౧౦

ఆ॥ వె॥ అహ మనంగ నాత్మ • యనఁ బరమాత్మయే
యగుట నాత్మశక్తి • యాత్మదిక్కు
కాఁగఁ గల్గు దైవి•కంబైన సామగ్రి
వలనఁ గల్గు భక్తి•వలను సుమ్ము. ౧౧౧

క॥ ఆరాధన నిజమైనఁ
గారాదా! గురుఁడె యూరక • సుబోధముఁ దాఁ
గోరుట వరమా! తరమా!
వారక చెవియొగ్గి వినఁగ • వాక్రువ్వంగన్. ౧౧౨

క॥ నిజభావ మరయనేరని
కుజనులతో మైత్రి యేల • కోటి యొసఁగినన్
విజనస్థలిఁ దపియించిన
గజవరదుం డిచ్చు సకల•కళ్యాణంబుల్. ౧౧౩

క॥ తనలోకము తనతో సరి
తనలోనే యుండు నడఁగుఁ • దనలోఁ బుట్టున్
దను దా నాత్మగ గురుకృపఁ
గను మనుజుఁడు ధన్యతముఁడు • గాఁడె విరక్తిన్. ౧౧౪

క

క॥ ధన్యుఁడుగాఁగ సకలమూ
ర్ధన్యుఁడు తనతత్త్వ మరయుఁ ♦ దవ కది యేలా
సన్న్యాసియైన విదపఁ
గన్యావరణంబు నవ్వు ♦ గాదె యెవరికేన్. ౧౧౫

క॥ సకలాఘంబుల నార్చుఁ
సుకవితనుం గూర్చు సర్వ♦శుభములఁ జేర్చుఁ
సకలాళితలలఁ జేర్చుఁ
మకుటమువలెఁ జేసి రామ♦మంత్రి మెవరినేన్. ౧౧౬

క॥ కేవలభక్తుఁడు కేవలుఁ
డౌ వేయేల మనుజుఁ డని ♦ యతని నెవండేఁ
భావించినంతమాత్రనఁ
బోవును గౌరవ మతండు ♦ పూర్ణాత్మసుమీ! ౧౧౭

ఆ॥ వె॥ చెప్పినట్లు నరుఁడు ♦ చేయఁగావలెఁ గాక
తప్పిపోయెనేని ♦ చెప్ప నేల
తప్పుపోలె సత్త్వ♦తత్త్వంబు లుండవు
మనుజునందు వాని♦మాటయందు. ౧౧౮

క॥ ఔదాసీన్యంబు భవా
నీదయ నిజ మది లభించె♦నే సిద్ధము జ్ఞా
నోదయ మటుపైఁ గోరఁగ
నేది వేఱొండు జన్మ ♦ మేదీ యేదీ? ౧౧౯

ఆ న ం ద సా ర ము.

గీ॥ జగము శ్రీవిష్ణులీల సం॥శయము లేల
శాంతికర్మావసానప॥ర్యంత ముంట
దహరమందున నిశ్చింతఁ ॥ దగులుకొంట
ద్వంద్వ మద్దాన దాఁటి త॥త్త్వంబుఁగంట. ౯౨౦

క॥ కేవలదృక్కై నిలిచిన
జీవన్ముక్తుండు లోక॥సేవ యొనర్పం
గా వలచునె తద్దర్శన
మే వలసినవారి కరుడె ॥ యిహమున్ బరమున్. ౧౨౧

క॥ కావున లోకుల నెంచుట
కేవలమాధ్యంబు రాము॥కీర్తనపరుఁడై
జీవత్వశంక వదలిన
కోవిదుఁ డెం దున్న నదియ ॥ కోవెల యన్నా! ౧౨౨

క॥ కోవెలభక్తులఁ బిలువం
గా వెడలునె దానికొఱకుఁ ॥ గద వచ్చెద రీ
భూవలయమందు దీనిని
వేవిధములఁ గాంచి యిట్టి ॥ వెట్టియుఁ దగునే? ౧౨౩

ఆ॥ వె॥ ఉత్తవాఁడు తిరుగు॥చుండు నొరులఁ దెల్ప
నుత్తముఁ డన నుండు ॥ నున్నచోట
నబ్జనాభుఁబోలి ॥ యన్నియు నీఁజాలి
యర్థిజనులమొ్రక్క॥లందఁజాలి. ౧౨౪

ఆ॥ వె॥ తెలియకుండువఱకుఁ • దెల్పఁజాలు నొరులఁ
దెలిసినంత యట్టి • వలవు విడుచుఁ
బరులు తెలియకుండఁ • బాడగుటకుఁ గాదు
తెలిసికొనెడు పథము • తెలిసికొనుట. ౧౨౫

క॥ తమమార్గ మనుసరింపక
విమలాత్ముండైన నేమి • వేడుకఁ జెఱుపం
గ మనోవికలతఁ గలుగ న
వమాన మొనరింత్రు మనుజ•పశువు లవశులై. ౧౨౬

క॥ గుణదోషవర్ణనం బది
గణుతింపఁగరాని పాప•కర్మము నిజమే
ఫణిశయనుప్రకృతి ద్వంద్వము
ప్రణుతించితిఁగాన శాంతి • భజియింతు నిఁకన్. ౧౨౭

క॥ ఎప్పుడుఁ జెప్పఁగఁ దగనిది
చెప్పెద నని చెప్పినట్లు • చెప్పుచు నేమో
తప్పుకొను తల్లి చెప్పక
తప్పక గ్రహియించుఁ గన్య • తాన వయసురాన్. ౧౨౮

క॥ ఈయాకథలం జెప్పెను
బ్రాయము రానట్టి పిల్లఁ • బతిఁ గూర్చుచుఁ దా
న్యాయమ్మగు బోధమ్మునఁ
గాయమ్ముం బ్రోచి తల్లి • కడతేర్ప వలెన్. ౧౨౯

క॥ పెద్దలు పరమరహస్యము
ముద్దుగఁ బోదిగొదరు సహజ॰ముగ మూలలలో
నద్దిర 'శరణం వ్రజ' యని
పెద్దచరిత్రమున దాఁచి ॰ పెట్టిరె మునియున్. ౧౩౦

క॥ అనూ క్తిగా బ్రకటించిన
మోసం బగుఁ దగినవారి॰బుద్ధికిఁ దగులుగా
గాసిలి వెదకిన దని యా
వ్యాసుఁడు విధిజాలమున సు॰వస్తువు దాఁచెన్. ౧౩౧

ఆ॥ వె॥ సత్పురుషుఁడుగాక ॰ సత్యంబు తెలియదు
ఊహఁబట్టి పోవు॰చుంట తగదు
నిశ్చయంబుఁ గోరు ॰ నే వృత్తి దానికి
సత్యవంతుఁ డేమొ! ॰ జనుఁడు తగఁడు. ౧౩౨

క॥ కానగా వైద్యాదుల మును
పూనరు మోగానుభూతిఁ ॰ బొందని జనులుగా
బూనఁగనీయరు పెద్దలు
పూనిక లన్నింట నేఁడె ॰ పుట్టెం జూండీ! ౧౩౩

క॥ సామాన్యమనుజజాతికి
సామాన్యపుఁ గృషియు భిక్ష ॰ సద్వ్యాపారం
బేమేనిఁ గలుఁగఁజేసిరి
కామాదుల ముంపర్తె రి ॰ కారుణ్యమునన్. ౧౩౪

క॥ రోగికిఁ బథ్యము విడుచుట,
బాగగు కనుచూపు తిరిగి ♦ వచ్చిన మఱలన్,
ద్యాగి యవధూతగ యగుట
చేఁ, గడతు రిల తమవిధిని♦షేధంబు లొగిన్. ౧౩౫

ఆ॥ వె॥ ఆత్మ నాశ్రయించి ♦ హంస లాడెడుభంగి
నాత్మ నాశ్రయించి ♦ హంసలాడు
వేద మాశ్రయించి ♦ విప్రు లాడెడురీతి
రాము నాశ్రయించు ♦ రామదూత. ౧౩౬

ఆ॥ వె॥ ఎవరిపిల్లఁడైన ♦ నిల సన్న్యసింపంగఁ
దల్లికడుపు సఫల♦తఁ గనె నండ్రు
నాట్యరంగమందు ♦ నటియించె నేనియుఁ
జూచి మెచ్చుకొందు ♦ రోద్యమకద! ౧౩౭

ఆ॥ వె॥ పెఱిగి పిల్లవాండ్రఁ ♦ బెక్కండ్రఁ గనియైనఁ
దమసుతుఁ డటులైనఁ ♦ దన్నుకొండ్రు
పరులు చెడఁగఁ గనుల♦పండువౌ వీరిని
నూర కేల పట్టి ♦ యూఁగుచుంట? ౧౩౮

క॥ జాలి నెఱుంగఁడె దేవుఁడు
చాలఁగ జీవులను బెంచి ♦ సమయించెడిచోఁ
గాలము రాఁ దానును నా
లీలన్ జరియించుచుంట ♦ లేనే చింతల్. ౧౩౯

క॥ రాముండుగఁ గృష్ణుండుగఁ
దా మున్ జనియించి జీవ•ధర్మము నడుపన్
సామర్థ్యము గలవాఁ డా
దామోదరుఁ డేల జాలి • దైన్యముఁ జెందున్ ? ౧౪౦

క॥ దేవుని పెండ్లికి విందుల
మై విహరింపఁగ నమస్త • మానందదమా
నేవీ కాకున్న నిలువఁ
దావులు జీవులకు ముక్తి•దాయకు లేరీ ? ౧౪౧

క॥ కల్పించు నన్ని మన మని
తెల్పంగాఁబోలు సుతుల • దేవతల లలిన్
గల్పింతురు జగమున నహో
తల్పా ! నీ వాత్మ నన్ని • తత్త్వంబులకున్. ౧౪౨

క॥ తనయందుఁ బుట్టు లోకము
తన కాశ్రియమాట చిత్రి•తమన్ను దలంచన్
దనలోనఁ బుట్టు రన మది
కనుము బహిస్తీర్థముల సు•ఖంబున కరయున్. ౧౪౩

గీ॥ ఎవనిలోకము వానిది • యెంచిచూడ
నైనఁ గృతియైన వెన్కఁ బూ•ర్ణాత్మశాంతి
దనుక, తన్మయుండై యుండు • ధన్యతముఁడు
రంగమునఁ గృతికైన పా•త్రివలె సుమ్ము. ౧౪౪

ఆ॥ వె॥ కానఁ బంచభూత ♦ కాలదిగాత్మము
నంబు లోలి నీవి ♦ ధంబులగుట
రామ రాజభూష! ♦ రాగి విరాగినా
బట్టు టెట్లు విడిచి ♦ పెట్టు టెట్లు? ౧౮౫

ఆ॥ వె॥ అన్ని ధాతువులకు ♦ నర్థ మొక్కఁడె యాట
నొక్కధాతువునకె ♦ పెక్కు లర్థ
ములును గల్గియుంట ♦ బోధించుఁ గేవలం
డొక్కఁ దన్ని గతుల ♦ నుండు నంచు. ౧౮౬

ఆ॥ వె॥ ఇంట నున్నవార ♦ లెన్ని రో వరుసలఁ
బిలుచుచుందు రొకనిఁ ♦ బ్రీతితోడ
నన్ని నామములకు ♦ నతఁ డొక్కఁడే పల్కు
నట్టి పేరు లుండు ♦ నందఱ కొగి. ౧౮౭

క॥ చెప్పించుకొనెడు శిష్యుఁడు
చెప్పెడు గురుఁ డెందు ధర్మ ♦ శీలుండై నన్
జెప్పంబూనుట మార్గము
తప్పుట సుమి! కానఁ గోరఁ ♦ దగదు తెలుపఁగన్. ౧౮౮

గీ॥ గురుఁడు బోధస్వరూపుఁడు ♦ నరుఁడు దానిఁ
గోరి నిజభక్తి రప్పించు ♦ కొనును బూని
భక్తియే శక్తి శివమూర్తి ♦ ప్రాప్తిఁ జేర
మానసమున ద్రిసు దాల్చిన ♦ మూర్తిన గురుఁ

డాత్మబోధంబునకు హేఁతు వగుట లేదె
మునులు తెలియరె? దక్షిణా◆మూర్తివలన
దీప మరయంగ వేఱొక◆దీప మేల
దాని సన్నిధిమాత్రాన ◆ జ్ఞానమబ్బుఁ
దెలియకుందుమె యద్దియె ◆ తెల్పనొక్క!
కావఁ బెద్ద లభ్యానయో◆గంబుకలన
మఱియు సాన్నిధ్యబలమున ◆ మహిమఁ గాంతు
స్వానుభూత్యేకమాన మా ◆ నాత్మవిద్య. ౧౪౯

క॥ లోపల రాగికదా యిఁక
నేపూతల నైన నుందు ◆ నే గుణ మకటా!
పాపం బజ్ఞుఁడు భ్రమపడు
రూపమునకె బుధుఁడు నిజము ◆ రూఢిగఁ దెలియున్. ౧౫౦

ఆ॥ వె॥ దైవసూత్రమందుఁ ◆ దగులుకొన్నప్పుడు
మంచిచెడ్డతనము ◆ లెంచ నేల!
ఎంచనేల స్వజన◆మితరులం చవలఁ బ్రా
ర్థించు టేల దైవ◆వంచకులకు. ౧౫౧

ఆ॥ వె॥ కన్నకడు పటంచుఁ ◆ గడుగర్వమును బూని
పరులఁ జుల్కనాడు ◆ బలువిధములఁ
దనకు వశమెయైనఁ ◆ దనయిష్టమెనట్లు
కనఁగరాదె కీర్తి ◆ మనఁగరాదె. ౧౫౨

ఆ॥ వె॥ పుట్టకున్న నీకు నట్టె ♦ తిట్టును విఱ్ఱ
వీగఁ బుట్టె నేని ♦ వేరె తంత
సిగ్గులేమి నిట్టి ♦ చేష్టలు దుష్టుల
కౌను, మానవతుల ♦ కౌనె జగతి. ౧౫౩

ఆ॥ వె॥ కంటఁ గన్నవారుఁ ♦ గన్నవా రొకరీతిఁ
దోలుబొమ్మ లీశు♦లీలకొఱకు
వెఱ్ఱి యొకరి వీడు ♦ వేఁడు మఱొక్కరి
నీతి గఱపును విప♦రీతచర్య. ౧౫౪

క॥ కనుగొన్న విషయ మొరులఁ
గనుగొన్నఁగాని శాంతి ♦ కలుగ దెవరికే
నను విషయము స్పష్టంబై
నను బరులం దెల్పఁ బూను ♦ నరుఁ డజ్ఞుండై. ౧౫౫

క॥ పాదద్వయి ద్వంద్వంబుల
నాదిఁ హరి యడఁచి పిదప ♦ నహ మను పశువుఁ
భేదింప నాదరంబున
నాదైత్యుఁ దృతీయపాద♦మందునఁ దాఁచెన్. ౧౫౬

క॥ పంచాయతివలెఁ దా సృజి
యించిన లోకంబు తన్ను ♦ నిటు నటుఁ జేయఁగ
వంచనగా నెంచక పూ
జించుఁగ దపియించు నెంచుఁ ♦ జేతఃప్రీతిన్. ౧౫౭

క॥ తనవడవడిఁ గొనియాడక
తనదోషం బెంచుకొనుచు ♦ ధన్యుఁడు రాముఁ
గని మోదమంది భక్తులఁ
గొనియాడుచు మనువుఁ ♦ గడుపుకొను గురుభక్తిన్. ౧౫౮

క॥ తనయెడఁ దన కభిమానం
బనునది నిజమైనఁ దనకు ♦ నానందద మా
వనిఁ జూనక, దుఃఖద మా
వనిఁ జూను నెవండు జడుఁడు ♦ భళిరే రామా! ౧౫౯

క॥ రోజించి కర్మఫలముల
నేజీవుం డాత్మదమన ♦ మెంతయుఁ జేయున్
రాజీవనయను నాత్మన్
బూజించునె యాతఁ డెట్టి ♦ పుణ్యుండైనన్. ౧౬౦

క॥ కర్మఫలంబులఁ గోరక
యర్మిలి నాత్మార్పణంబు ♦ నతిశయభక్తిన్
ధర్మము తప్పక చేసెడు
నిర్మలమతి కితరధర్మ♦నియమం బేలా? ౧౬౧

క॥ పిల్లలయెడ నభిమానము
తల్లుల కెంతేని కలదు ♦ దయయును నైనన్
దల్లులు పరులకుఁగాఁ దమ
పిల్లల హింసింతు రెంత ♦ విపరీతంబో. ౧౬౨

క॥ అధికారము తత్త్వము నీవ
యధర్మ మనునవి భజించు ♦ నాదరమున నే
బుధుఁ డతని కబ్బు నిజముగ
సుధ లూలికొడు గురునిపదము ♦ సుమి కలిలోనన్. ౧౬౩

క॥ పరమార్థము మానంబున
ధర వ్యవహారంబు వాక్య♦తాత్పర్యమునన్
సరసులు లలి సాధింతురు
హరినామస్మరణమందు ♦ నతిశయభక్తిన్. ౧౬౪

గీ॥ కఱచుకొనుపని పిల్లది♦గాక యెట్లొ
విడిచినా తల్లి వెళ్లునే ♦ బిడ్డ విడిచి
మర్కట న్యాయమన్న సా♦మాన్యదృష్టి
కది పరిత్యాగముగఁ దోఁచు ♦ నిది నిజంబు. ౧౬౫

గీ॥ ధ్యానమును బ్రార్థనంబు నా♦త్మార్పణంబు
కలిగి గాయత్రిమంత్రంబు ♦ లలితమగుట
దానికంటె మంత్రంబు జ♦గానఁ గాన
రాదు లేదని వాదింత్రు ♦ వేదవిదులు. ౧౬౬

క॥ తనవంటివారు లోకులు
తనదే లోకంబు బ్రహ్మ ♦ తత్త్వం బిది యం
చనుకొనెడు సాధు వెపుడున్
నిను నాత్మన్ గొల్చు రామ! ♦ నిశ్చలభక్తిన్. ౧౬౭

క॥ పృతినిధుల వెదకికొనుచుఁ
బృతికెడు నీచునకు నేటి ♦ పామాణ్యంబో
కృతకృత్యత సద్వర్తన
మతులితపథ మనఁగ వినియు ♦ నాశయ! భయమా! ౧౭౮

క॥ కేవలనిమిత్తమున కగు
జీవుని తచ్చర్య నరసి ♦ సిద్ధుం డాఁగా
కేవల నావల జన్మం
బేవెట్టికిఁ దీర్ప నార్ప ♦ నీహా జనించున్., ౧౭౯

క॥ విష మమృతం బమృతంబే
విష మగుటఁ జూచుచున్న ♦ భేద మడఁగు నా
విషమస్థితి సమరస మది
ఋషిసామ్మన విందు నేఁటి ♦ కీకలిఁ గందున్. ౧౮౦

క॥ పరమవిరక్తుఁడు భక్తుఁడు
గురుశైలిని ననుసరించి ♦ కోవిదుఁడే యా
ధర రిక్తుఁడు యుక్తుల నే
పరిగణనము చేసి పరమ♦పాతకి యాఁగా. ౧౮౧

క॥ వారింపరాని యుహా మను
వైరినిఁ గల్పింతె వాని♦వశ మొనరింతే
శ్రీరామా! మము నీయవ
తారములఁ స్వస్వరూప♦తత్త్వార్థనమే. ౧౮౨

ఆ॥ వె॥ దొంగ బ్రిదుకుచేత ♦ దొరయాన పరమేశు
మానవుచ్చుఁ గలఁడె ♦ మొదలు చెఱచు
కొంటగాక, భవము ♦ గొంటగాక, పరు ల
నవ్యావడు స్వభావ♦సరణిగాక! ౧౭౩

ఆ॥ వె॥ త్రికరణములఁ జేయు ♦ సకలంబు దూష్యంబు
దృక్కుగా నిలువక ♦ తిరుగు నెడల
నూరకున్న నెట్టు ♦ లున్నను దృక్కైన
నిగమతుల్యుఁ డతనిఁ ♦ బొగడవశమె. ౧౭౪

క॥ ఈమచ్చింతయుఁ దద్గత
దోషాకరవాక్కు దానితోఁ దుల్యంబౌ
వేషము కర్మము నా కగు
శేషాద్రిపతి! మనము నినుఁ ♦ జేరమినిఁ జుమీ! ౧౭౫

క॥ ఉన్నది నిత్యం బెట్టటో
యున్నది యెదుటఁ జరగుచు ♦ నున్నది తా లే
కున్నది శక్తి జగము నీ
వెన్నఁగ నున్నది యొకటిగ ♦ నెల్లపుడు శివా! ౧౭౬

క॥ కానఁ బొడఁచిన ధ్యానము
మానము స్వస్థుండవైన ♦ మఱి యొక్లవరే
నైనఁ బేర్కొదిపఁ బై
పైనఁ దగుచర్య లోన ♦ భక్తియొ సుమ్మా. ౧౭౭

సీ॥ పురుషుఁడు, కవి, పాత్ర ♦ పుట్టువిధంబున
బ్రహ్మము, పర, సేను, ♦ రస జనించు
దాను, కలయు, తాను ♦ దథ్య మే చందంబు
గలుగు సర్వ మట్లు ♦ గలుగుచుండు. ౧౭౮

క॥ వ్యసనము రూపముగాఁ గల
పసరము జీవుండు జగతిఁ ♦ బ్రబలె నెటో యి
ద్ది సకలము బ్రహ్మ మని నీ
యసదృశకృపఁ దా వ్యసనము ♦ హరియించు నజా! ౧౭౯

క॥ నీలో లీనం బగు వాఁ
డేలీలఁ సంచరింప ♦ నేమి భయం బా
కీలోఁకృతి తత్కృతి కిఁక
వేళకుఁ దగురీతిఁ ద్రిప్ప♦వే పరమేశా! ౧౮౦

క॥ సార్థకమై గురుసూక్తి కృ
తార్థుల నొనరించు సంశ♦యము లేలా న
రార్థంబులు ఫలియించు య
థార్థముగా జపమొనర్ప ♦ నచ్యుతభక్తిన్. ౧౮౧

క॥ సార్థకము సార్థకం బగు
వ్యర్థ మనర్థకము నగు న♦నర్థకమొకదా!
సార్థకము భరతుభావన
ప్రార్థన లేకున్న నతనిఁ ♦ బాలించెఁజుమీ! ౧౮౨

క॥ జనుఁడు శివోహ మ్మనుచున్
జనని యనున్ శివునిరాణి • సార్థకమానా!
మనువు యథార్థము సేయక
మననము సేయంగ లాభ•మా మోసమ్మాన్. ౧౮౩

క॥ కానన్ ద్రికరణశుద్ధిగఁ
బూనిన సర్వంబుగనుఁ బ్ర•పూర్ణత జగతిన్
జ్ఞానము విజ్ఞానము ప్ర
జ్ఞానము బ్రహ్మము గురుచర•ణ మనుట నౌనా! ౧౮౪

క॥ శ్రీశైలాగ్రము గన భవ
పాశము విడు నన్నమాట • వారాంగనకే!
యీశా! గురూక్తిశంకా
లేశంబే లేకయున్న • లే ముక్తుండౌ. ౧౮౫

క॥ అధ్యానయ హరియించిన
మిథ్యావాదంబు లేద • మృతియేడ నోకో!
సాధ్యాసాధ్యము లేదనో
బోధ్యము సిద్ధంబు సర్వ•మును నా వినవా! ౧౮౬

క॥ సాంబునిఁ జూచుచు మహాధుం
డంబాచర్యలను నెంచ•నగునా నగరా
సాంబునికిన్ దగియున్నది
యంబను నెంచంగ జీవు • లపురా! మొవరో. ౧౮౭

క॥ శివునిం జేరఁగ జీవునిఁ
బవిత్రిత నరయుట కెట్లో ◆ పలుపోకడలన్
శివ! పోవుచుందు మూఢుఁడు
శివశివ! సమరసము లేమిఁ ◆ జెడు నవశుండై. ౧౮౮

క॥ పరులవలెఁ దానుఁ దనవలెఁ
బరు లని పండితుఁడు సర్వ◆వాంఛల నార్చన్
నిరతము గాయత్ర్యర్థము
స్మరించు నాత్మార్పణంబు ◆ శాంతి నొనరుచున్. ౧౮౯

క॥ జీవ! పరాధీనుఁడవై
నీ వెటు లాత్మార్పణంబు ◆ నిజముగఁ జేయన్
గా వెఱవరి వాదో సదా
కేవలతత్కృపకు వేచి ◆ కృతి గావలయున్. ౧౯౦

క॥ ఎద్దానఁ బుట్టు సర్వం
బెద్దానన్ బెఱుఁగు నణఁగు ◆ నెం దిది యెదియా
నద్దెల్ల ప్రొద్దు వెలిగెడు
నద్దఖిలాశ్రయము బ్రహ్మ ◆ మెది యది దలఁతున్. ౧౯౧

ఉ॥ అన్నిటనుండునొక్క పర◆మాత్ముఁడయంచుఁ దరించు దృశ్యమె
ట్లున్నను దత్తదాచితిని◆యోగవియోగముల ద్రవించుచోఁ
జిన్నవకేళియందుఁ దన◆చేయు నపర్యగ నెంచి భక్తినం
పన్నుఁడు చేయుచుండు నుబ్ర◆వత్తినిముక్తుఁడుజన్మకర్మముల్.

క॥ అవశులు జీవు లితరులఁ ద
మవశమొనర్చుటకు యత్న•మా! యక టకటా!
ప్రవిమలవిజ్ఞానము మది
ని వలచి కర్మమొనరింప•ని కుమతులవలెన్. ౧౯౩

గీ॥ కార్యకారణరూపసం•కల్పవితతి
మదిని నెఱనమ్మి పరమాత్మ • మఱచుచున్న
భవమహాబ్ధిఁ దరింప నెం•వ్వారికిరంబు
జీవ! యాత్మార్పణంబు సం•జీవనంబు. ౧౯౪

గీ॥ ఐనఁ గాకున్న నొక్కటే • యనెడువాని
కైన పిదపఁ బుట్టును వాక్య • మవ్విధముగఁ
గాకయుండుట కది యుప•కారకంబె
జీవ! యాత్మార్పణంబు సం•జీవనంబు. ౧౯౫

క॥ అనవస్థాదోషము సుమి
మనుజుఁ డుపేక్షించుచు నియ•మము స్వేచ్ఛాభా
సను లౌల్యంబును బెంచుట
కను దానిని నిజముచేయు•క సుఖము కలదే? ౧౯౬

క॥ చిలుకలలోపలఁ బ్రాణము
కలదందురు రక్కసులకుఁ • గథలఁ విననా!
కలదంతయుఁ గల దనిమొద
కలదేవఁ దాని నాత్మ•యందురు సుమతీ! ౧౯౭

క॥ పదపదమున కెంతయుఁ దా
నుదయించెడు నహము దాని ♦ నోంకారముతో
మొదలంటఁ బెరికివైచుము
రొద యడఁగును జపము సాఁగు ♦ రూఢిగ జీవా! ౧౯౮

క॥ ఒక్కఁడె బ్రహ్మంబయ్యును
బెక్కుగఁ దోఁచుచు సకలముఁ ♦ బ్రేరేపించున్
జక్కఁగ నిది కల దాదిని
నిక్కం బిది కాంచి శాంతి ♦ నిలుతురు ధీరుల్. ౧౯౯

క॥ గాయత్రీమంత్రార్థము
న్యాయమ్ముగ బోధపడిన ♦ నానాత్వం బే
చాయం గానఁగరా దని
ధీయుతు లాత్మానుభూతిఁ ♦ దెలియుదురు లలిన్. ౨౦౦

క॥ ఇదమిత్థ మ్మనరానిది
హృదయంబున వెలుగునదియు ♦ నిదియంతయునై
నది యాత్మపదార్థం బని
మొద రది కేవలతపమున ♦ నె లక్షించు నెటో. ౨౦౧

క॥ వక్రింపఁజేసి పౌరుష
మక్రమ మని చూపి దైవ ♦ మదియే నిజ మన్
సక్రమబోధం బిడి నిజ
విక్రమమున్ దెలుపు నాత్రి ♦ విక్రముఁ గొలుతున్. ౨౦౨

క॥ తనభేదసృష్టిహేతువు
తనకుం దాఁ దోఁచుచుంట • తన్మయతనుమీ
ఘనశాంతికి నంస్మృతికిన్
జనయిత్రి పరాంబ జీవ•సంజ్ఞన్ దనరున్. ౨౦౩

క॥ శాంతియె యతులశ్రీయ
స్సంతానము గురునికరుణ • జ్ఞానము కలుగన్
స్వాంతము శ్రీహరిపాదా
క్రాంత మగున్ దాన శాంతి•కద నిశ్చింతన్. ౨౦౪

క॥ గురుభక్తి గురునిసూక్తి
గురువృత్తిన్ మదిని నిల్పు•కొని జీవితమున్
ధర గడిపెడునాతం డిహ
పరసుఖములకొఱకు వెదుక•వలెనా తనకై ? ౨౦౫

క॥ శ్రీహరిరూపం బిది యని
యూహించుట వానిజన్మ • ముత్తమము కదున్
సాహసము శాంతి యొక్కెడ
నైహిక మాముష్మికంబు • నందించుటచేన్. ౨౦౬

క॥ రాజాజ్ఞ నడుచుచుండెడు
రాజపురుషునికి వలెఁ గవి•రాజునకున్ ద
త్తేజోయుతుఁ డగుటను నే
రోజఁ దలంప వగు శాంతి•యున్ సాహసమున్. ౨౦౭

క॥ కాన్ ధైర్యము శాంతియు
బూన్ జీవుండు సర్వ•మున్ శ్రీహరిచే
నౌ నని శ్రుత్యర్థము గురు
చే నెఱిఁగి, నిజానుభూతి•చే స్థిరపడఁగన్.   ౨౦౮

క॥ శాంతియు సాహస మొక్కెడ,
గాంతురు హరిభక్తు లంచు • గాండీవిఁ దా ము
న్నెంతయు నిమిత్తమాత్రను
వింతఁగ నొనరించి కృష్ణ•విభుఁ డెఱిఁగించెన్.   ౨౦౯

క॥ ఏమియుఁ జేయని శాంతియు
నేమైనన్ జేయఁగల్గు•నెడ సాహసమున్
దా మిల నిమిత్తమాత్రము
గా మది నెఱనమ్ము నాఁడు•గద జీవులకున్.   ౨౧౦

క॥ పరమార్థము నడవడిచే
నరుండు వ్యవహార మెఱుఁగు • నాయకువలన్
ధర ప్రతిపదోక్తవిధిని, వి
పరీతధర్మంబు లెల్ల•భంగులఁ జెఱచున్.   ౨౧౧

ఆ॥ వె॥ ఉత్తది జగమంచు • నుత్తముం డెఱిఁగిన
కొలఁది లోన శాంతి • కలుగుఁ గొలఁది
స్వస్థుఁడై రమించు • సర్వధర్మంబులఁ
దత్త్వమూర్తి పరమ•సత్యమూర్తి.   ౨౧౨

గీ॥ నిర్వికారంబుగా నిల్చి ♦ శర్వుఁ గొల్చు
సర్వధర్మవిచారార్థ♦సార మిదియ
కానఁ దన్మయుండై యొంటిఁ♦గ నిలువండు
సర్వకర్మంబు హరియింప ♦ శాంతిఁ బెంప. ౨౧౩

క॥ దీనిని నిత్యధ్యానము
గా నెంతురు పెద్ద లాత్మ♦కల్యాణముగా
మానముగా జ్ఞానముగాఁ
గాన సహజభక్తి సలుపఁ♦గాఁ బూర్ణుండౌ. ౨౧౪

క॥ ఇతరులకుఁ దనవలనఁ దన
కితరులవలనను, భయం బొ♦కించుక వల దా
ప్రీతము మహాత్ములు సలిపెద
రతులితగతి నాత్మఁబోలి ♦ యలరుటఁ జుమ్మీ. ౨౧౫

క॥ అనలి యాత్మేషణయును
లేని సుఖం బొండొరులకు ♦ లేదు సుమీ, యా
త్మానుభవ మిట్లు కలుగని
చో నిది గమనించి యొరులఁ ♦ జూడక కృతియా. ౨౧౬

గీ॥ ప్రీత్యగాత్మఁగ నిల్చిన ♦ పరమపురుషుఁ
డాత్మయే సుమ్ము పరమాత్మ ♦ యగు నిజమ్ము
కాన నతని జీవన్ముక్తుఁ ♦ గా నుతింతుర్
బ్రహ్మవాదులు గురుభక్తి ♦ ప్రబలుకొలఁది. ౨౧౭

క॥ స్మృతి యనుభవసమయమున జ
గతి నేరికి నుండఁ బోదు • కావునఁ దనుఁ దాఁ
గృతిఁగా నెఱిఁగెడివాఁడు సు
కృతియే! తన్మయుఁడు కాక • యీశ్వరకృపచేన్. ౨౧౮

క॥ స్మృతితప్పిన తన్మయునికి
స్మృతియును ననుభవము • జరగు రెండొకరీతిన్
అతఁ డాత్మమూర్తి నెఱియు న
నతరము! సర్వాత్మనా వి•నతికృత్యంబౌ. ౨౧౯

క॥ అందఱఁ జేరిచెడువాఁ
డిందిరవల్లభుఁడు రాముఁ•డే యెల్లెల్లో
యుండుట తలఁచెడు తలపునఁ
గుందగ బనిలేదు వేళ•కుగ యోజించున్. ౨౨౦

క॥ పాపముచేసితి నని పరి
తాపమురూపం బొకపరిఁ • దద్దయు సాధ్యం
బే పనియే నా కనుకొను
రూపం బొకమా అహంత • రూఢిగఁ దాల్చున్. ౨౨౧

ఆ॥ వె॥ ఆత్మవిద్య నరసి•నంత నారెండు రూ
పములతో నహంత • పడును జెడును
నిన్నుఁ జూచుచుండు • నీతోడనే యుండు
నీవు కాఁగ నుండు • నిజము రామ! ౨౨౨

క॥ మమతాహంకారంబులఁ
గ్రమముగ విడనాడి యాత్మ • గా భాసిలు నా
సమరసమూర్తిని ధరఁ గని
విమలులు భజియించుచుందురు • వెఱ్ఱికి వశమా! ౨౨౩

ఆ॥ వె॥ ఆత్మయందునుండు • నాత్మతోనుండును
నాత్మయయ్యు నుండు • నందురు పర
ఎండ నెండమావు • లుండెడిరీతిని
మూఁడుమతము లిట్లు • మొదలు పుట్టె. ౨౨౪

గీ॥ స్వాత్మ కానందజనకమౌ • నట్లు జీవ
తతిని సృజియించి యాడించు • దైవతంబు
తత్ప్రకృతిని సంతసంబందఁ • దాను దుఃఖ
భాక్కగునె! జీవుఁ డూరక • పొక్క నేల! ౨౨౫

క॥ నడిపించుచుంట సర్వము
నడుపుగ గాలంబుఁ గడుపు • నవ్యప్రీతిగ
దడఁబడఁడు నైజధర్మము
వడిఁ బూనుగ దత్త్వవిదుఁడు • పరమాత్మవలెన్. ౨౨౬

ఆ॥ వె॥ ఆత్మతేజ మట్టు • లన్యంబు వెడలెడు
నొకట నన్ను రెండు • నొక్కఁ డౌను
నరునిమాట లట్లు • నారాయణునివాక్కు
నరుని నోటవచ్చు • హరిది హెచ్చు. ౨౨౭

ఆ॥ వె॥ తన్మయతను బుట్టి ♦ త త్త్వమై విలసిల్లు
నదియపౌరుషేయ ♦ మనఁగఁ జెల్లుఁ
బురుషయత్నమునను ♦ బుట్టెడు నయ్యది
నోటిమాట వట్టి ♦ రోటిమాట. ౨౨౭

ఆ॥ వె॥ మాట మాటఁబోలి ♦ నోట వెడలునంత
మాత్రి సామ్య మన్ని♦మాటలందుఁ
గలదె ? యథకృతి కల♦కవికృతి భువి నిండు
లోటుమాట లౌర ♦ నోట నుండు. ౨౨౮

ఆ॥ వె॥ ఆత్మ కాంచరాని♦యట్టు తచ్ఛరీరమౌ
నాకసంబుఁగాన ♦ నలవికాదిఁ
దద్గుణంబు శ్రుతిగఁ ♦ ద త్త్వంబుఁ దెలుపంగ
సాధనంబు గురుని♦బోధ మట్లు. ౨౩౦

ఆ॥ వె॥ సాధులట్టులౌట ♦ శబ్దప్రమాణికు
లై తరించుచుందు ♦ రాకసంబు
దాన నాత్మమార్గు♦లై నరులట్టుల
సంచరింతు్రి భక్త♦సంఘు మలర. ౨౩౧

ఆ॥ వె॥ కానఁ దాను గురుము♦ఖమున విన్నట్టిది
నమ్మి యభ్యసింప ♦ నరుఁడు గాంచు
నున్న దున్న యట్టు ♦ లూహాచే భయమెచ్చు,
నాత్మవిద్య యొక్కఁ ♦ డభయమిచ్చు. ౨౩౨

క॥ సహజము నీశ్వరకృతమై
యిహపరములకువలె నూరక • కే గలిగెడున్
తహతహపా టెది గూడఁగ
సహితశయనుల్ జేర్చు • నదియ యానందంబై. ౨౩౩

క॥ తలయంటుట సబ్బలదుట
వలె శుద్ధుఁ బుద్ధు నాత్ము • వాంఛించిన వా
రల కిల ద్వంద్వంబులవలె
మలినతఁ బోఁగొట్టి ముక్తి • మఱియొం డిడునే. ౨౩౪

క॥ జీవుండై రిక్తుండౌ
దేవాలంబంబుచేత • ధీసాక్షియ యౌఁ
గేవలసమాధధీరుఁడు
శ్రీవిద్యాపూర్ణుఁడు గురు•సేవల నోఁగా. ౨౩౫

క॥ ద్వంద్వంబుల నోరయుటచే
ద్వంద్వాతీతాత్ముఁ డగును • దథ్యము కానన్
ద్వంద్వాత్మక యగు ప్రకృతిని
ద్వంద్వాతీతుండు శివుఁడు • తాఁగాఁ గొలుచున్. ౨౩౬

క॥ దక్షుండే యైనను గురు
దీక్షన్ దక్షుఁడు గాక • దివ్యజ్ఞానా
పేక్షన్ స్వకృతిని నొందే
రక్షణముం బడయఁగలఁడె • రాధాలోలా! ౨౩౭

క॥ కర్మబ్రహ్మం బొక్కఁడ
నిర్మలమగు బ్రహ్మ మొక్కఁ•డెలవున మఱియున్
శర్మద రామబ్రహ్మం
బర్మిలి నొకచోట జీవుఁ•డా గురుకృపచేన్. ౨౩౮

ఆ॥ వె॥ దానికొఱకు వెడలుఁ • దనకుఁగా వెడలెడు
నాతురతను జీవుఁ • డాత్మఁగూర్చి
తత్త్వవేత్త యగుచుఁ • దత్కాలసంశయం
బుల హరించుకొనుచు • లలిని మఱలు. ౨౩౯

ఆ॥ వె॥ పనికిమాలిన దనఁ • బలుకకొన్నది యన్న
నాత్మ నంటకుండ • నాడువ దనఁ
బాలలోనినీరు • భంగి తాదాత్మ్యంబుఁ
జెందనట్టి బయట • చేదు నీరు. ౨౪౦

ఆ॥ వె॥ కార్యరూపమైన • కర్మంబుతోఁగాని
కారణంబుతోడఁ•గాని తనకు
నైక్యసిద్ధికల్గు • నాత్మందు జీవుండు
ముక్తుఁ డందు రటుల • మొదలనుంట. ౨౪౧

ఆ॥ వె॥ పైనఁ దోఁచువాని • ప్రత్యుదాహరణంబు
కొఱకు సృష్టిచేసి•కొనియె నజుఁడు
బీజపత్రములకు • భేదాధికరణంబు
కలదె, గతుల తెలి•కావె రెండు. ౨౪౨

ఆ॥ వె॥ భక్తజనులకైనఁ ♦ బ్రత్యేకయోగంబు
కలదు దాన నాత్మ♦గాకపోవు
నే! సకలము నూర♦కేల యీ చింతించు
టాత్మమయత వతిశ♦యముగఁ గనుము. ౨౮౩

ఆ॥ వె॥ ఆత్మమయత నున్న ♦ నమృతుండు జీవుండు
కాక యున్నఁ బశువు ♦ కాలవశత
పాలలోని నీరు, ♦ పాలఁ గలియు నీరు
రెంటికివలె భేద ♦ ముంటఁజేసి. ౨౮౪

గీ॥ అప్పరావరుదర్శన ♦ మైనమాత్రి
సర్వసంశయభయములు ♦ సమసిపోవు
కర్మము హరించును హృదయ♦గ్రంధి విడును
సత్య మిటు వేదనిచయంబు ♦ చాటుచుంట. ౨౮౫

క॥ ఆత్మార్పణ మెఱుఁగనివో
స్వాత్మకృతం బనుచుఁ ♦ గలఁగుఁ బాపబద్ధంబుల్
స్వాత్మార్పణ మొనరించిన
నాత్మానుభవంబుఁ గలిగి ♦ యలరెడు శాంతిన్. ౨౮౬

క॥ పంచావస్థలలోనఁ బ్రి
పంచముఁ దనువుల్ మఱచుట ♦ పరమార్థం బం
చెంచి కద రామమంత్రిం
బంచిత సద్భక్తి ననిశ ♦ మందుల్ విందున్. ౨౮౭

క॥ అతఁ డంతయునై వెలయఁగఁ
బతి యెవ్వఁడు భార్య యెవతె ♦ వండితుఁ డెవఁడో
మతిహీనుఁ డెవఁడు మనమా!
కృతకృత్యత మఱువ కునికిఁ ♦ గేవలుని గురున్. ౨౪౮

క॥ తననోట నూరు నీరే
తను జీవింపంగఁ జేయుఁ ♦ దథ్యం బటులే
తనలోఁ బుట్టిన దేవుఁడు
తను సంరక్షించు సర్వ♦థా నైక్యమునన్. ౨౪౯

గీ॥ నాయహంకారమే వైరి ♦ నాకు నగుటఁ
బరుల నన నేల యాత్మభా♦వంబుఁ గలిగి
మెలఁగఁ గల్గితినా మేలు ♦ కలుగు దాని
జాలు గురుసూక్తి హరిభక్తి ♦ చాలుఁ దెలువ
నరుల శాసింప నలచుట ♦ హరిని మఱచి
పరుల శిక్షింప రక్షింపఁ ♦ బాలుపడుట
బోధచేయంగఁబూనుట ♦ బుద్ధిమాలి
తెలుపవే యహంకృతిని సం♦దేహమేల
నిన్ను నమ్మని జీవుండు ♦ నీచుఁ డగుట
వాని నమ్మినవాని న♦వ్వాదె జగంబు
నిను భజించుట నిశ్చింత ♦ మనుటకాదె
ఘోరిభవమోచనా గురు♦బోధరచన! ౨౫౦

క॥ పెద్దలవలెఁ జరియింపక
పెద్దలమాటలను నేర్చి ♦ పేరెడు కుంఠుల్
దిద్దఁ గలవాని జగమున
వద్దిర! గన నగున యొకని ♦ నైనన్ మనసా! ౨౫౧

క॥ కర్మానుష్ఠానంబున
శర్మద మగు తపముఁ జేయు ♦ సమయమునందున్
నిర్మలసమాధిని నతని
ధర్మము తత్త్వయోగ ♦ దము సమరసమే. ౨౫౨

క॥ పరమేశ్వరి నైపుణి యిటు
లరయంగా దత్త్వనిష్ఠ ♦ యన నాఁగద నం
సరణంబున జీవుల కది
పరమార్థము చేసి మూసి ♦ వరుఁ దుండుఁగదా! ౨౫౩

క॥ జ్ఞానాజ్ఞానంబులచే
మానవులకు శాంతి భ్రాంతి ♦ మహినిఁ గలుగు నన్
జ్ఞానానందమయుఁడు హరి
కా నిత్యము శాంతి త ♦ త్త్వ మగు సర్వంబున్. ౨౫౪

క॥ జగదాత్మలకున్ భేదం
బాగిఁ జేయుట మలినజీ ♦ వు నుద్యోగం బా
జగదాత్మల కైక్యంబే
తగు యోగము శుద్ధజీవ ♦ తతి కరయంగన్. ౨౫౫

క॥ అనుభవముఁ గూర్చు దేవుం
డనుభవ మల్లాట గురుఁడౌ ♦ యాను గదా యె
వ్వని కేమి చెప్పఁబూనుట
కన దౌర్భాగ్యంబు నా స్తి♦కత సూచించున్.  ౨౫౬

గీ॥ ద్వంద్వములు లేవు, లేదు వి♦శ్వంబు నీకు
నాది నారాయణస్వామి ♦ యగు నఖలము
తత్పరత్వమ్మునందు ని♦త్యమ్ము మునిఁగి
యుంటివో! యూడవో కర్మ♦యోగమందుఁ
దద్విచారంబు నీ కేల ♦ త త్త్వబుద్ధి?  ౨౫౭

మ॥ సనకేంద్రాబ్జజచక్రిశంకరుల స♦చ్చారిత్రముల్ నిచ్చలున్
విని నన్ వేదము లభ్యసించినను ను♦ర్విన్ లాభ మొక్కింతయేఁ
గనఁ డంధుండు రవీందుతారకలఁ దాఁ♦గానంగ లేనట్లు వే
తనక ర్తృత్వముపీడ బ్రహ్మమయుఁడై ♦దాసుండె ధన్యుండగున్.

క॥ తనయాత్మరైన రాముని
గనలేని దురాత్ముఁ జూచి ♦ కష్టంబులపా
లొనరించి, తిక్క తీరిన
వెనుకన్ శివుఁజేయుశ క్తి ♦ వేఁడద భ క్తన్.  ౨౫౯

గీ॥ తన్మయత్వంబునకుఁ గర్మ♦త త్త్వమునకు
నై జ మైక్యంబుకాని చిం♦తాలవంబు
భేదభావంబు కల్పించి ♦ ఖేదపడదు
జీవుఁ బ్రినవించు మాయఁగాఁ ♦ జెప్పుకొంట్రి

దాని ఛేదించు శస్త్రంబు ♦ జ్ఞాన మద్ది
పరిణవమూలంబు గురుపాద♦పద్మసార
మాదినారాయణుని సుప్రసాద మందుఁ
గానఁ దద్ధ్యానఫలము మోక్షంబు ధ్రువము. ౨౬౦

గీ॥ అంగసామ్య మంగులకు నైక్యంబు నీదు
కనుక నామరూపక్రియ♦లను గణింప
రాదు, సత్యంబుఁ గన్గొన ♦ వాదవాంఛఁ
బోదు బుధులకు మనము సంవాదులగుట. ౨౬౧

ఉ॥ అన్నియు నొక్కరీతిగ నెంచి యోయినఁగూర్చుచునున్న విప్రు డీ
కన్నుల కెన్న నేల యిది♦కా, దది కూడ దటంచు భక్తిసం
పన్నులభాగ్య మద్ది పలు♦మాఱు వినంబడు విష్ణుఁడే జగం
బన్న హితోక్తిమూఢుల క♦హా! చెవిదూరద దేమి పాపమో? ౨౬౨

క॥ శంకలబుట్టెడు నానా
సంకల్పంబులను జిక్కి ♦ సమరసభావం
బంకకు రానియని వో
జంకక యెవ్విధిని శాంతి ♦ సంపాదించున్. ౨౬౩

క॥ నే ననుకొను జీవుండే
నేనై యున్నట్టివాఁడు ♦ నిజ మాత్ముండా
రానీ పోనీ యెల్లీ
కానీ బ్రహ్మం బొకండు♦గా సర్వంబున్. ౨౬౪

క॥ నేనై యుండును దేవుం
డే నను గొనుచుండు జీవుఁ • డిట్లగుటఁగదా!
నే ననుకొను టెఱుఁగని స్వ
ద్ధ్యానుభవం బాత్మమూర్తి • యగు నిరుగడలన్. ౨౬౫

క॥ వచ్చినదాదిగ మరలక
జచ్చెదునందాక నీచ•సంగతితోనే
పుచ్చుచుఁ గాలము లోలోఁ
బుచ్చెదు జీవుండ! పరమ•పూరుషుఁ గనుమా. ౨౬౬

క॥ కలవాఁ డితరుల నడుగం
గలవాఁడె! పరాకు యాచ•నావృత్తి కడుక
గలవానినైన భిక్షుకు
వలె బిట్టలయించు దుఃఖ•వార్థిక ముంచున్. ౨౬౭

క॥ తనకొఱకుఁ బరులఁ జెఱచును
దనుఁ జెఱచుకొనుక గదా! యిఁ•తరులకొఱకు నే
జనుఁడేని దీనిఁ గనినక
మనమున గణియించు నెట్లు • మహి నొరుకృతులన్. ౨౬౮

క॥ కానక నే నని యనునది
తా నెంతగ శుద్ధ మగునొ • తత్ప్రతిబింబం
బౌ నటు దృశ్యము జగ మని
మానము వహియించి యాత్మ•మార్గముఁ గనుమా! ౨౬౯

ఆ॥ వె॥ తిరిగి చూడకున్న ♦ ధీరుండు సత్య మ
యృదియుఁ జూడ కునికి ♦ నాత్మయాను
దానిఁ జూడకునికిఁ ♦ దన్మయత్వంబు, వా
చామగోచరంబు ♦ సమరసంబు. ౨౭౦

క॥ గమనింపం డెద్దేనియు
భ్రమఁజెందం డెన్నఁడేని ♦ ప్రారబ్ధమునన్
గ్రమ మనుసరించి కదలెడు
సమయంబునఁ దాల్చు సాధు♦సమరసమూర్తిన్. ౨౭౧

ఆ॥ వె॥ నీది నాది కాదు ♦ నిజ మాదినారాయ
ణుండె దీనికర్త ♦ నుండి యట్లు
కాకయున్న నిట్టి ♦ గ్రంథంబు బుట్టునా
నరులనోట దేవ! ♦ గురులమాట. ౨౭౨

క॥ మనసు చెడఁగొట్టఁ దలఁచుచు
మనసిజుఁ డొకనాఁడు తెలివి♦మాలినవాఁడై
ఘనయోగిమనము దూరఁగఁ
గని, నీకర్మంబు సార్థ♦కం బగు ననియెన్. ౨౭౩

తే॥ గీ॥ భయము భక్తియు రెండు జీ♦వత్వ మందు
పరమశాంతిని బ్రహ్మను♦భవ మటందు
సర్వమును రామచంద్రప్ర♦సాద మందు
ప్రణవ మాత్మయోగమున కు♦పాయ మందు
వాసుదేవుండు గురువుగా ♦ వచ్చు నందు. ౨౭౪

తే. గీ. యోగి జీవించుఁ దత్తత్త్వ • యోగనిష్ఠ
భక్తి సేవించు శ్రీరామ • భద్రు నెపుడు
పరమశాంతుండు సర్వదా • బ్రహ్మచారి
స్వపరభేదంబు లేదు సం • ద్వాదుఁ డగుట. ౨౭౫

తే. గీ. సకలపాత్రధర్మంబుల • సంచరించు
సుకవి ధర్మంబు గాంచిన • సూరి యట్లు
తాల్చు నిశ్చింత నేపాత్ర • ధర్మమైన
నిరువురకు లేదు భేద మిం • తేని చూడ. ౨౭౬

క. ప్రత్యక్షంబుగ వరముల
నిత్యముఁ దా నిచ్చుచున్న • నియతాత్ముండై
సత్యముగా భజియింపని
భృత్యుని దయఁ బ్రోఁచు శౌరి • యెంతటికృపరో! ౨౭౭

ఆ. వె. భక్తిలేనివాఁడు • పలుకర్మములఁ జేయ
జగము మెచ్చు నొచ్చు • నగధరుండు
ఐక్యబుద్ధిలేని • యాఁడుది పతిఁ గొల్వ
జగము మెచ్చు నొచ్చు • మగఁడునట్లు! ౨౭౮

ఆ. వె. నీడ గెలువ నేర్చు • నే యెవఁ డేనీడ
నీడగాఁగ నెఱుఁగ • నేర్చుఁగాక
మాయ గెలువనేర్తు • మా! మన మామాయ
మాయఁగా నెఱుంగు • మనుజుఁడె సుఖి. ౨౭౯

క॥ వేంకటనాథుఁడు మాహా
త్వంకజపీఠంబునందుఁ • బరమప్రీతిన్
శంకరుఁడై నిల్చెను మా
కింకర జంకంగ నేల • యీయాభ్రాంతిన్. ౨౮౦

క॥ తా నెవ్వఁడు తన దెయ్యది?
పోనీ వే తెవ్వ రింకఁ • బురుషోత్తముఁడే
తా నీ విశ్వం బయ్యెన్
గానన్ నీ వతని కగుదుం • గద స్వస్వంబున్. ౨౮౧

క॥ శాంతిని శంతశ్శాంతిగ
నెంతురు విజ్ఞాను లాత్మ • నెంచుటగాదా!
శాంతికి జ్ఞానానుభవము
లెంతయు నేకాంతభక్తి • యే వలయుఁజుమా! ౨౮౨

శా॥ ఏదీచూతముకొంతచెప్పుము భవ•ద్ధీంకారమాహాత్మ్యము
న్వేదంబందున, శాస్త్రమందున మహా•విద్వాంసులందేని మ
ర్యాదాలేశము మాకు లేదనుచు సం•ప్యాగ్రీతిఁ బ్రశ్నించుచోఁ
బాదాక్రాంతుఁడుగాక యున్న గురుల•ప్పాపాత్ము రక్షింతురే?

క॥ ప్రకృతి పురుషాకృతియుఁ దత్
వికృతికి సృష్టిస్థితిలయ•వికృతు లగుఁ దత్
ప్రకృతియుతాదిమమూర్తియె
సకలాధారంబు నిత్య•సత్యార్థంబున్. ౨౮౪

ఆ॥ వె॥ ఆత్మభజన మెఱుఁగ • కజ్ఞానమున మున్గు
మూఢవితతిఁ దెలుపఁ • బూనినట్లు
శ్రీనివాసుఁ డాత్మ•సేవకముఖమున
నూఁవు ముందువెనుక • కూర కట్లు. ౨౮౫

ఆ॥ వె॥ దర్శనోత్సవంబు • దాసుల కబ్బుమిఁ
గొంతచింతఁజేయు • నంతరంగ
మందు హరిని నిల్ప•నట్టి మూఢాత్ముల
వీరి కప్పగించు • శౌరి కాంచు. ౨౮౬

ఆ॥ వె॥ ఆత్మలోన నుండ • నటునిటుఁ బోదురు
దేవు నరయుట కుప•దేశములకు
మనుజకోటి మాయ•మంత్రింబులను జిక్కి
ఖ్యాతికొఱకుఁ బుట్టు • నీతి యింత. ౨౮౭

క॥ గురుదీక్షాతత్పరుఁడయి
హరిపదమే యాశ్రయించి • యంతర్ముఖుఁడై
పరిపూర్ణశాంతి వడసిన
గురుపుత్రున్ లోకమిత్రు • గోవిదుఁ డెఱుఁగున్. ౨౮౮

తే॥ గీ॥ వేషధారి స్వధర్మంబు • విడువలేఁడు
కవిచమత్కృతి కేల తా • గర్వపడుట
సుకవికినిఁ దన కైక్యంబుఁ • జూచుకొన్నఁ
గోరఁదగినది లేదు సం•కోచ మేల!

భక్తిజాగ్రత్సుషుప్తిసం • పాదనంబు
నిట్లు చేయు సర్వజ్ఞాన • కివ్వఁ డీడు
దేశికోక్తిని నోంకార • దివ్యశక్తి
నిత్యముక్తుండు శాంతుండు • నిర్మలుండు. ౨౮౯

ఆ॥ వె॥ వలయువాని వీడి • వట్టిమాటల నాడి
వేఱుపథము నడచి • వెతలఁ గుడుచుఁ
దత్త్వబుద్ధి నాత్మ • తాదాత్మ్య మిచ్చును
గురుఁడు మెచ్చు నిచ్చు • హారివిముక్తి. ౨౯౦

క॥ అజగరుని సముపదేశం
బజస్రమున్ మదిని నిల్పి • యారాధింపం
గ జడత వాసెను, హరినిం
భజియింపఁ గల్గునట్టి • భాగ్యము గలిగెన్. ౨౯౧

క॥ అంతయు నీశ్వరుఁ డనుచును
నంతయు నీశేచ్ఛ యనుచు • నగపడు జగ మీ
యంతయుఁ దద్రూపం బం
చేంతయుఁ గని భ్రాంతిచెంద • దేలా మనసా! ౨౯౨

ఆ॥ వె॥ ఆశ మాను టన్న • నాత్మార్పణం బన్న
యోచన యనుమాట • యుడుగు టన్న
సకలసిద్ధి యన్న • సామ్రాజ్య మన్నను
ముక్తియన్న దేశికోక్తి గాదె? ౨౯౩

క॥ ద్వైతవిశిష్టాద్వైతుల
కూఁత యగుఁ బ్రణవము సాధ్య • ము త్తమగతి క
ద్వైతుల కాత్మేతరమే
చేతోగతి మెలఁగకునికి • సిద్ధులు సుమ్మా! ౨౯౪

తే॥ గీ॥ భర్తుఁ డొకరుడ నొకచోఁ దశపస్వి యొక్క
తావునను బ్రహ్మచారి సద్ధర్మవర్తి
కర్మనిష్ఠుండు గాయక•కవివరుండు
నొచ్చు నొప్పించు నానంద • మిచ్చు మెచ్చు. ౨౯౫

తే॥ గీ॥ మొదల ప్రియము నవల హితంబు రుచియింప
నక్రమంబైన పథ మద్ది • యగుట బుధులు
హితము విడిపించి ప్రియముల • నెవఁడు కోరు
వాని భ్రష్టునిఁగా నెంచి • బహిరొనర్త్రు. ౨౯౬

తే॥ గీ॥ నాకుఁ బెట్టుము ముందఱ • నీకు నవల
నుపకృతి యొనర్తు ననెడువా • రుందు రెందు
లెక్క లేకుండ వేరైన • నొక్కఁ డెవఁడొ
చిక్కువానికి క్రమము క్తి • దక్కుచుండు
గోవు లేకుండ పాలను • గోరువాని
కబ్బుచో నది రొుఠుసాత్తై • యైన భంగి
కారణములేని కార్యంబు • కలిగినేని
వట్టి యాభాస మది క్రమఁ • బెట్టుచుండు

కాని విధినిషేధంబులు ♦ కల్ల లంచుఁ
బ్రకృతి మెంతయుఁ బ్రియముగాఁ ♦ బలుకుచుండు
దానిమాత్రము గ్రహియించి ♦ ధర్మపథము
విడిచి వర్తించువానికి ♦ వెఱ్ఱి పుట్టు
నిష్ట మెద్దైన దానిని ♦ హిత మొకండ
నేర్చుఁ బ్రియ మన్న హితమును ♦ జెఱచుఁగాన
మొదలుపోయిన వడ్డికి ♦ ముదము జెందు
మూఢు లిలలోన విహరింతు్రి ♦ ముక్తులట్లు
చిన్నయుద్యోగమం దున్న ♦ చెనటి ధరణి
క్రమముఁ దప్పించి పైయధి♦కారివలెన
నడచునో మొదలే పోవు ♦ నణఁగియుండి
చక్క వర్తింప నధికార ♦ మెక్కుగాదె! ౨౯౭

క॥ క్రమవిక్రియంబు లే దిలఁ
జుమి దొంగలు తెచ్చుచుండు ♦ సొత్తున కల్లే
క్రమగతి విడిచి చరించెడు
కుమతులు పరధర్మవాంఛఁ ♦ గొఱగా రెందున్. ౨౯౮

తే॥ గీ॥ ఒరునిసొత్తు భరింప లే♦కునికి దొంగ
యక్రమంబుగ నది విక్ర♦యంబుచేసి
ఫలము నాభాసముగఁ బొందు♦పగిది జడుఁడు
కర్మమార్గాన నడచుట ♦ కష్ట మనుచు

సక్రమంబుగ విడిచి స♦యంబుదక్క
శాంతిగాంచినచందాన ♦ జగతిఁ దిరుగ
భ్రష్టుఁడౌగాని సౌఖ్యంబు ♦ వట్టువడునె? ౨౯౯

తే॥ గీ॥ అన్నిమతములు మనమత♦మందుఁ గలవు
అనధికారికి నందని ♦ యట్టు లుండఁ
బెద్దలొగి దాఁచిపెట్టిరి ♦ ప్రీతితోడ
నితరమతములు తెల్పిన ♦నేమి ఫలము?
వాని శ్రవణగోచరముగాఁ ♦ గాని లభ్య
మగువిధంబునఁ జేయలే ♦ రట్లుగాన
వెఱ్ఱులై వారి నర్థించి ♦ వెంబడింపఁ
దగదు పరిపూర్ణతత్త్వవి♦త్తనయు లగుట
మనకు వేదాశ్రితులకు ధ♦ర్మమ్ము తొలుత
గురుముఖంబునఁ దెలియుట ♦ గోప్యముగఁ ద
దీయసన్నిధి నాత్మసం♦తృప్తిఁ గాంచు
టంచు రవ్విధి చరియించు ♦ టద్ది విద్య. ౩౦౦

తే॥ గీ॥ అంతయును బ్రహ్మ మందు ర♦య్యదియు నిర్గు
ణం బఁట యెటులగు సమన్వ♦యంబు జగతి
ననిన ద్వంద్వంబు లన్యోన్య ♦ మాహరింప
సగుణనిర్గుణబ్రహ్మముల్ ♦ నిగమవినుత!

రెండుఁ బరమార్థదృష్టి యొకండ యగుట
వీలునుంబట్టి పోవును ♦ విబుధవరుఁడు
భేదబుద్ధిని ద్వేషంబుఁ ♦ బ్రీతి లేదు
స్వస్వరూపానుసంధాన♦సమరసంబు. ౩౦౧

క॥ కృప యనఁగా భగవంతుని
ది పరమభక్తు లదియు నఁట ♦ దీనుండై పా
పపు పశువులఁ గొల్చుటయే
యపరాధము, దానఁ బుట్టు ♦ నన్నియఘంబుల్. ౩౦౨

ఆ॥ వె॥ తగినరీతి నీతి, ♦ ద్వంద్వార్థసంప్రీతి
పాతకంబు, బహుళ♦భీతిదంబు,
ఐక్యసిద్ధి జీవ! ♦ యాత్మార్పణం బెట్లొ
ఊరకుంపు మదియె ♦ యూఁచుచుండు. ౩౦౩

క॥ మనమునఁ గోర్కి వశించుట
తనయందున నున్న రామ♦త త్త్వముఁ గనుటే
కవ, ననుబంధచతుష్టయ
మున నొప్పెడు ధర్మ మున్న ♦ మునియై మనుటే. ౩౦౪

తే॥ గీ॥ ఒకరి కొక రుపకృతిఁజేయు♦చుండ నెట్లొ
ప్రీతిజనియించు నది బహు♦రీతిగాఁగ
భావ ముదయించుఁ దులఁదూఁచఁ ♦ బట్టుఁ బడదు
విష్ణుగాథలు వినుచుండ ♦ విష్ణుభ క్తి

యట్టి జనియించు నస్థాన ♦ మతిశయించుఁ
బూర్ణశాంతికి గురుతు ♦ పుట్టి పుట్టి
సకలధర్మానువర్తి ప్రసాదమూర్తి
పరసనద్భక్తి వ్యక్తిగాఁ ♦ బరిణమించు. 305

క॥ అతిబలుఁడై నిర్మలుఁడై
కృతిపతియై రామదేవకీర్తనపరుఁడై
హితుఁడై దేశికసుతుఁడై
మతిమంతుండైన లోక♦మాన్యుం డెవఁడో? 306

క॥ అమనస్కస్థితి కలిగిన
విమలుండై మించు బ్రహ్మవిద్య ఫలించున్
సమరసమూర్తిఁ జరించును
నమశ్శివాయ ధర సుకృతి ♦ నారాయణుఁడే. 307

క॥ కని జీవకర్మతత్త్వముఁ
గనియుండు బరమాత్మయందుఁ ♦ గైవల్యంబున్
విని గురుముఖమున శ్రుతులన్
మనమా! హరియింపు వాస♦నాతతి దృక్కై. 308

క॥ జ్ఞానముకలుగఁ దొలఁగు న
జ్ఞానము ధ్యానంబుచేతఁ ♦ గలుగు నదియునున్
ధ్యానం బాత్మాభిముఖుం
డై నానాదృశ్యజాల ♦ మడఁచుట లోలోన్. 309

క॥ లేమి కల దనెడు జీవుని
లో మాధవుఁ డుండు క్రీడఁ ♦ లోఁ గల్పనలే
రామా! లోఁ గని నన్నే
నీమూర్తిగఁ దెలిసి తెలుపఁ ♦ నే గురుభక్తిన్. ౩౧౦

క॥ జగము గణియింపకుండుట
జగముఁ గణియించుచుంట ♦ సరియెటు లన్నన్
జగ మన్నఁ గద రెండును
జగమున హరి యుండు నన్న ♦ సమరసము గదా! ౩౧౧

క॥ దేహోఽహ మ్మనువాఁ డా
శ్రీహరినిఁ వేంకటేశుఁ ♦ జిత్తమునఁ సం
దేహము మోహము గెంటక
సాహసమున నిల్పవలెనె ♦ సద్గురు భక్తిన్. ౩౧౨

క॥ లోకముఁ జూడక తనపద
మేకమతిఁ గొల్చువార ♦ మే మనుకొనకే
మాకుఁ శాశ్వతసౌఖ్యము
లీకే శ్రీవేంకటేశుఁ ♦ డెట్లుండు నిఁకన్? ౩౧౩

క॥ కల్పంబుగ సేవించిన
స్వల్పత్వఘనత్వశంక ♦ లా! అథవా సం
కల్పము శ్రీహరి దంచు వి
కల్పములా చీ! భజింతు ♦ కనకాంబరునిన్. ౩౧౪

క॥ అది వేదమంత్రసారం
బది దేశికసూక్తి బుధులకనుభవ మదియే
ఇదియంతయు బ్రహ్మం బను
నది తెలియఁగఁ గోరువాఁడె యవలంబించున్. ౩౧౫

క॥ అన్నియుఁ బ్రణవార్థములే
యెన్నఁగ దగ దండ్రి పెద్దలే మంత్రములన్
బన్నగభూషణభక్తియె
యున్నన్ సిద్ధించు నన్నియున్ సమముగనే. ౩౧౬

తే॥ గీ॥ ఉండి లేనట్లు బ్రహ్మంబ యుండు నొకఁడ
లేకయున్నట్లుఁ దోఁచు నీలీల జగము
కనఁగ రెండుగ నుండి యొక్కండె యాట
తనకు తత్త్వంబుగాఁ దెల్ప ధన్యతముల
భక్తవరులనుఁ జేయంగఁ బ్రబలినాఁడు
కృష్ణవేషంబుఁ దాల్చి శ్రీవిష్ణుమూర్తి. ౩౧౭

క॥ భోగము హరిపదయోగము
త్యాగము సర్వార్థసిద్ధిదాయక మకటా!
రాగము సంసృతిమూలము
శ్రీగురుఁడే వేంకటాద్రిశివుఁ డరయంగన్. ౩౧౮

క॥ సిద్ధం బగు రంగంబున
నద్దిర సిద్ధంబు సాధ్య మ•ను నీరెంటన్
ముద్దుగ జగతీవేమను
దిద్దుకొనున్ శాంతిఁ దేలు • దేవుం డొకఁడై. ౩౧౯

చ॥ సమరసదృష్టి నొప్పు గురు
సత్తముపాదముఁ గొల్చుచుంట నే
విమలమతిన్ జరింపఁగల
విద్య లభించె ముదంబు పెంచె బ్ర
హ్మము లలిమూర్తిఁ దాల్చినటు
లారయఁగాఁ గనుపించె బండితో
త్తముఁడు తమోహరుం డిల ను
దారచరిత్రుఁడు పూతగాత్రుఁడున్. ౩౨౦

ఆ॥ వె॥ సకలభూతవితతి • సామరస్యము గల్గు
నాత్మ సోమయాజి • మైనమాత్రి
నవ్యశోభన మమ•నస్కయోగం బబ్బు
మబ్బుపోక లోక•మాత సాఁక. ౩౨౧

క॥ విధి యన దైవం బనఁ ద
ద్విధిగావున దాని కెందు • వేఱొనరింపన్
వృధగద యత్నముచేయుట
వృధుతరయత్నముఁ గాంతురి • విబుధులు దీనిన్. ౩౨౨

క॥ కూర్చినదైవం బెటో పో
  కార్చుచు నీతోలుబొమ్మ • లవి తమ కోర్కుల్
  తీర్చు నని యార్చు ననియును
  జేర్చెదు జీవులకు గలదె • సిగ్గు శుభంబున్. 3౨౩

క॥ బోధించిన బాధించిన
  శోధించిన నీశ్వరేచ్ఛ•సుమి యింకేలా
  క్రోధము? మాధవునిత్యా
  రాధన మొనరింపు జన్మ•రాహిత్యముగాన్. 3౨౪

ఉ॥ రాముఁడు కర్త, భోక్త శివ•రాముఁడు కర్మఫలంబు జానకీ
రాముఁడునామరూపములు•రాముఁడు దేవుఁడుజీవుఁడుఁ గుణో
ద్దాముఁడుసర్వమంచిలను•దారుడుధీరుఁడుసత్కృమారుఁడుఁ
మామకదేశికోత్తముఁడు • మాధవుఁ డాయనఁ దెల్పె నల్పమే!

క॥ రాముఁడు సుగుణోద్దాముఁడు
  గా మారుచునుండు జగము•కై వడి నుండుఁ
  శ్రీమహిళావల్లభుఁడై
  వేమరు రమియించు మించు • విరమించు నొగిన్. 3౨౬

క॥ అజ్ఞానము వేఱాటయె
  సుజ్ఞానం బైక్యబుద్ధి • సుకుచిరభక్తిఁ
  బ్రజ్ఞానం బాత్మస్థితి
  విజ్ఞత లేకున్కి పాప•వితతికి నెలవౌ. 3౨౭

క॥ తొలితపసికలఁకఁ జూపఁగఁ
గలరూపుం జూపినట్టి ♦ ఘనుఁడే లేఁడా?
కలకాలము భక్తాళికిఁ
దెలుపఁగ నిజతత్త్వ మాత్మ♦దీప్తి నొసంగన్. ౩౨౮

సీ॥ ప్రకృతివాదులఁ జూచి ♦ భయమందుటయెకాని
ఐక్యబుద్ధియు లేని ♦ నాస్తికులఁట
ప్రారంభవాదు లా♦రంభముల్ వర్జింప
యతిపౌరుషము నమ్మ ♦ నాస్తికులఁట
మతములన్నియు నిట్లు ♦ మత మితి యత్తద
న త్తన్నమాట ని♦జంబు కావఁ
బరమేశ్వరేచ్ఛచేఁ ♦ బ్రకటింపఁబడు తత్త్వ
మునకై నిరీక్షించు ♦ బుధుఁడు భక్తిఁ
దపము యోగంబు నానంద ♦ ముపరతియును
శాంతి సమరసజ్ఞానంబు ♦ సర్వ మదియు
నాత్మ నర్పించు టాత్మచే ♦ నాత్మయందు
దేశకో క్తిని నవ్విధ ♦ తేటపడును. ౩౨౯

క॥ అంతర్గతభేదము లన
నంతింబై వెలయు రసను ♦ నాఊరసంబుల్
వింతా నవవిధభక్తుల
నంతంబై తోఁచు సిద్ధి ♦ నాత్మస్థితియే. ౩౩౦

తే॥ గీ॥ కార్యకారణబంధంబు • కలుమవృత్తి
తన్మయత్వకృతంబు స్వ•ధర్మ మగును
తిన్మయత్వంబు జ్ఞానామృ•తానఁ గలుగ
నిత్యమగును జీవన్ముక్తి • సత్యముగను. 330

క॥ శ్రీహరిభజనము మది సం
దేహము లేకున్ననాఁడు • దేహము మఱవఁగ
సాహసము గల్గునాఁడును
మోహము విడనాడునాఁడు • మొదలు గురుకృపన్. 332

క॥ కృషిచేయ నొడలు వంగమి
మిషలఁగ గల్పించుకొంచు • మిథ్యావాక్కుల్
ఋషివలెఁ బల్కుచుఁ గల శే
ముషి వృథచేసెదవు జన్మ•ముఁగ వ్యర్థముగన్. 333

క॥ కోరినగతి మెలఁగఁగఁ దగు
కారణముల్ వెదకికొంచుఁ•గద భువి జీవుల్
వైరాగ్యమునకుఁ గారణ
మారా! లేదన్న భక్తి • యన్నది యున్నా? 334

క॥ కైవల్యంబని లయమని
కేవలలయయత్న మనియుఁ • గేశవభక్తిఁ
భావించి ముక్తిబంగుల
సేవించి తరింతురు భక్త•శేఖరులు బలిన్. 335

క॥ లయ మనఁగ దైవయోగము
లయయత్నం బనఁగ జీవ♦లాంఛన మది ని
ర్భయుకై వల్యం బాత్మఁగ
జయమందిన యునికిఁ బరమ♦శాంతికి మునికిన్. 33౬

క॥ బుద్ధికిఁ దోఁచినభంగి న
బద్ధములం గూర్చి చెలఁగ♦బడనాన 'క్రియా
సిద్ధి స్సత్వే' యనుచుఁ
వృద్ధులు పలుమాఱు పల్క♦ వినియుఁ జీవా! 33౭

క॥ వికృతిగ సుకృతి భజింపుము
ప్రకృతివిగా నిల్వ మాత్మ♦భావముతోడఁ
సుకృతివిగ నిల్చి పొల్చుము
సకలావళి నిన్నుఁ జేరి♦ శాంతిభజింపన్. 33౮

క॥ ధీరుం డిలఁ దపమున నీ
వారమువలె లాఘవంబు♦ స్వచ్ఛతయుఁ శా
రీరావరణాభావముఁ
బ్రారబ్ధాంశంబుఁ దాల్చుఁ♦ బరుఁడై పొల్చున్. 33౯

గీ॥ నిద్రపట్టినచో నేన♦ నిలువు మనెద
మాను మప్పు, డందాఁకఁ గ్ర♦మంబుమీఱి
వినరుచుండుము నా నది♦ వింతగాదె
తెలిసి భక్తిక్రియల్ మాని♦ యలరుటల్లె
ధర సహజసమాధినిఁ గోరు♦ పురుషులకును. 3౪౦

క॥ రసికజనమనస్సరసిజ
వనతితి సుఖయింతు భక్తవత్సల! యేదిచు
ర్వ్యసనంబులఁ గృశియించెదు
పసులట్ల మరలింప లేవా పశుపతి కావా? ౩౪౧

క॥ శూన్యస్థానము హిమగిరి
కన్యాధవుగేహ మంచుఁ గాంచిన భక్తుం
డన్యంబుఁ గాంచనెంచును
ధన్యుం డాత్మాభిముఖతఁ దా రమియించున్. ౩౪౨

క॥ తన్మయుఁడౌఁ దత్పరుఁడై
తన్మాత్రింగ డగును బిదప ధ్యానగరిమ ని
న్ను న్మరగిన ధీరుం డో
చిన్మూర్తి! రామరాజశేఖరుభక్తిన్. ౩౪౩

క॥ రోచించుచుండు నెట్టటొ
యాచరణంబందు జీవుఁ డవశుం డయ్యుక
నీచున శివ్విధి దుఃఖవి
మోచన మాత్మార్పణంబు మూఢున కిలలోన్. ౩౪౪

ఆ॥ వె॥ కుక్క దాలిగుంట గొప్పబుద్ధినిఁ బూని
తోఁక విప్పి లేచి దూరు నింద్ల
మూఢుఁ డట్లు పలుక గాధవై రాగ్యంబు
సమయమైన యపుడు జారుచుండు. ౩౪౫

ఆ॥ వె॥ ఈశు నీశ్వరేచ్ఛ ♦ నెఱిఁగి వర్తించుట
గురుకృపామహత్త్వ♦సరణిఁ గనుట
అనుపూర్వి రోసి ♦ యాప్రణాళికఁ గోసి
యలరుచుంట యందు ♦ రాత్మవిదులు. ౩౪౬

ఆ॥ వె॥ అనుపూర్వి యేల? ♦ యాశాభయంబుల
వేల? హీనవృత్తి ♦ నేల? కడఁక
నొక్క మెతుకుఁ బట్ట ♦ నుడుకుట దెలియదా!
యనుభవంబు లేల ♦ యతిశయముగ. ౩౪౭

ఆ॥ వె॥ బాగుచేయఁగలవె ♦ భ్రష్టునిఁగాఁ జేయఁ
గలవె యొరుని? పట్టి ♦ కలవరంబు
అనుపూర్వి మఱచు ♦ టది మహోమానంబు
ధర్మసార మద్ది ♦ తత్త్వసిద్ధి. ౩౪౮

ఆ॥ వె॥ ఒక్కదేశమందెఁ ♦ బెక్కుదిక్కులు నట్లు
ఎండమావు లట్లు ♦ నెండయందు
నొక్కమనుజునందుఁ ♦ బెక్కువరుస లెట్లు
ముకురమందు బింబ♦ములును నట్లె. ౩౪౯

ఆ॥ వె॥ ఒక్కబ్రహ్మమందుఁ ♦ బెక్కు జగంబులు
కల్పితములు కామ♦కళలఁ బట్టి
కాన నెవనిజగము ♦ వానితో నేగును
ఉత్తజగము లెన్ని ♦ యున్న నేమి? ౩౫౦

ఆ॥ వె॥ కాంచువాఁడు పోవఁ ♦ గల్లజగము పోవు
నహ మనంగ బ్రహ్మ ♦ మగుటఁ జేసి
కాంచఁబడిన యాత్మ ♦ కలకాల ముందును
జీవుఁ డటు తిరుగఁ బ♦రావరుండు. ౩౫౧

ఆ॥ వె॥ పాలలోని నీరు ♦ పాలఁ గల్పిన నీరు
పాలలోన నుంచు ♦ పంచదార
పాల నాశ్రయించు♦భంగి భక్తవరులు
రాము నాశ్రయింతు ♦ రన రమింతు. ౩౫౨

ఉ॥ ఇచ్చ నెఱింగి సేయఁగల ♦ రెవ్వరు నొవ్వక యుండునట్లు! మే
ల్వచ్చినఁ జూచి యోర్చి మన♦లన్ గడుఁ బ్రీతినిఁ బ్రోఁచువారు లే
రెచ్చు వ్యయంబుఁ జేసి మది ♦ నేవ జనింపఁగ దుష్టవర్తనన్
నొచ్చుచు నొవ్వఁ జేయుదురు ♦ నోటికి వచ్చినయట్లు కూయుచున్.

తే॥ గీ॥ స్వాత్మతేజంబు వెలువడు♦వంతదనుక
వట్టిమాటలఁ బ్రజ లక్ష్య♦పెట్ట దనుచు
నన్ని నాళ్లకు వే మన ♦ మెఱుఁగకునికేఁ
గాకి శోధించు నిటు నేటి♦కాలమునకు. ౩౫౪

ఆ॥ వె॥ కదు నిరర్థకుండు ♦ జ్ఞానహారుఁడు యోచ
నాకృతి దరిఁజేర ♦ నభయమిచ్చు
సిద్ధమంత్రి మను న♦సినిఁ బూని వే దురింప
నాత్మమయుల నుంచు ♦ మనికి మిట్లు. ౩౫౫

ఆ॥ వె॥ సర్వకాలములను • సగుణనిర్గుణభేద
మునను నాత్మమయతఁ • గనెద వద్ది
సర్వజంతువులకు • సాయుజ్యపదవి నీ
యమితసులభమార్గ • మందురు బుధులు. ౩౫౭

తే॥ గీ॥ ధ్యానయోగసమాధుల • నమలుఁడై స్వ
ధర్మపరుఁడైన జీవత • తా హరించు
నంత ద్వంద్వంబులను దాఁటి • యాత్మమయతఁ
జెలఁగు నెట్టటో భక్తుండు • తెలియవశమె ? ౩౫౮

క॥ వ్యవహారమునకుఁ గా కీ
భువి మాటలచే యథార్థ•బోధ మలవియే ?
పరివిమలమతి తత్త్వం బెఱుఁ
గ వలచి దరిఁజేరువాని•కై గురుబోధల్. ౩౫౯

తే॥ గీ॥ సిద్ధ మీ సర్వ మనియెడు • చింతసేత
అట్లు చింతించుటయు సిద్ధ • మనెడుకూత
నమ్మిన ట్లాచరించుటే ! • నగదె జగము
సర్వమును సిద్ధ మనఁగాను, • శాంతికలిమిఁ
బెంచుచుండిన నయ్యది • పెంచుచుండు
జ్ఞాన మధ్వ మగపడుదాఁ•క నడచునెడ
నవల మార్గంబు దోఁచు గ•మ్యాంబువఱకుఁ
గర్మమును జ్ఞాన యోఁగొంటిఁ•జేర్మిఁ బెంచు

నాచరణచేత ననుభవ ♦ మనుభవమున
నాచరించుట జంటగా ♦ వగుచునుండ
రెంటిబలమున జ్ఞానంబు ♦ పంటపండు
దాన నాత్మగ మిగులు సత్యంబు బుధుఁడు. ౩౫౯

ద్విపద॥ భేదమే యున్నచో ♦ భేదమే యుండు
భేద మరయకున్న ♦ ప్రీతియే నుండు
వ్యవహారమున నెట్లు ♦ పరమార్థమందు-
శివజీవభేదంబు♦చే నట్లు కుందు
భేదింపఁగాఁ దత్త్వ♦భేదంబు కలుగు
సాధింపఁగా నౌనె ♦ సామ్య మవ్వలను
దలవెండ్రుకల కుండఁ ♦ దద్దయుఁ బూజ
తలవదలినవెన్కఁ ♦ దగునె యాపూజ
ఐక్యసిద్ధిని దేవు ♦ ననుభవం బుండు
నైక్యంబు లేనిచో ♦ వధముఁడై యుండు
నేదైన నెట్లున్న ♦ నీశ్వరుం డన్న
రాదు జన్మం బాత్మ ♦ రాముఁడే యెన్న. ౩౬౦

క॥ ఆనందావాప్తికిఁ గద
యేనరుఁ డే నెద్ది సేయు ♦ నిది కల్గుటకుఁగా
జ్ఞానులకు సిద్ధమంత్రము
గానఁ దత్స్మరణ మేమి ♦ ఘనకార్యంబా? ౩౬౧

తే॥ గీ॥ కర్తృకర్మక్రియలవలెఁ ♦ గలుగుచుండు
ధరణి స్ఫోటంణ్ణ నొరులకుఁ ♦ దద్దఁ దెలుప
దృష్టవాస్తవముం దది ♦ యేది, లేని
దయ్యు లేని జీవుని బోధ ♦ కమరుచుండు. ౩౬౨

కం॥ తనరూపము తాఁ జూచుట
కును బుద్ధి జనించునట్లు ♦ కువలయమున జీ
వునికి, భగవంతునికిఁ గ
ల్గినఁ జూచును దనదురూపు♦లే తాఁ జెడకే. ౩౬౩

తే॥ గీ॥ కాన సృష్టి కనఁబడును ♦ గాని వాస్త
వంబు గాదు గలంపున ♦ వచ్చు పోవు
చుండు మూలంబు తానయై ♦ యుండుఁ గాన
సాక్షియై యుండు లేక ప్ర♦శాంతి నుండు. ౩౬౪

ఆ॥ వె॥ బీరకాయఁ జూచి ♦ విత్తుల సంఖ్యను
జెప్పువాని జగము ♦ చెప్పుకొనదె
దానిలోని గుట్టు ♦ వానికిఁ దెలియుదా!
సహజమాట, యాత్మ♦శక్తి కాదు. ౩౬౫

ఆ॥ వె॥ తీపినీటి కిచ్చుఁ ♦ దియ్యమామిడిచెట్టు
కాకర యిడు చేదు♦కద ధరిత్రి
మనుజరూప మిచ్చు ♦ మానిని యనుకొన్న
నీశ్వరేచ్ఛ వాని ♦ కెఱుకగాదె. ౩౬౬

ఆ॥ వె॥ అందమైన దాని♦నట్లు చేసెను ధాత
మందగమనఁ జేసె ♦ మానిని నిటు
సద్గుణంబులందు ♦ స్వాతంత్ర్య ముఁడునా!
వల్లవెండ్రికలను ♦ దెల్లఁజేయ. ౩౬౨

సీ॥ పరమేశ్వరధ్యాన♦పారీణకత్వానఁ
బరగెడువానికే ♦ పరమపదము
తలఁచి నిమిత్తమా♦త్రింబుగా సర్వంబు
మెలఁగెడువానికే ♦ కలదు ముక్తి
సర్వంబు సిద్ధమౌ ♦ సమరసభావనఁ
జెలఁగెడువానికే ♦ చెల్లు ముక్తి
హరిభక్తి శివశక్తి ♦ గురుభక్తి శ్రీసూక్తి
కలిగినవానికే ♦ కలదు ముక్తి
దేహమాత్రావశిష్టుఁడై ♦ తిరుగువాని
నేను నా దను మాటయే ♦ లేనివానిఁ
గర్మసూత్రంబు ముక్తుని♦గా నొనర్చు
ముక్తుఁడై నట్టివానికే ♦ ముక్తి నిజము. ౩౬౩

తే॥ గీ॥ సర్వ మీశ్వరమయమాట ♦ సత్యమాట
జగతి నెక్కడి కక్కడే ♦ సరిగ నుండు
నెంతచెట్టున కరయంగ ♦ నంతగాలి
కూర్పుభేదానఁ బూర్ణత ♦ కొఱతపడదు. ౩౬౪

క॥ అమనస్క రాజయోగము
క్రమముగ సిద్ధించె నేటి౯ కాలమునకు శ్రీ
రమణునికృపఁ దత్సన్నిధి
విమలమతి౯ నిల్వఁగలుగు • విజ్ఞత గలిగన్. ౩౨౦

ఆ॥ వె॥ తెలిసినంతవఱకు • ధీరత నడువఁగఁ
దెలియునం దఖిలము • సులభశైలి
దృష్టిగోచర మగు • తెఱవున నడుచుచు
వచ్చునేని చేర్చు • వలయుదాని. ౩౨౧

క॥ కాలము గడుపుము శ్రీహరి
లీలల సర్వేంద్రియములు • లీల సుఖింప౯
బాలురఁబోలిన సద్భ
క్తాలి౯ నెరనమ్మి జీవుఁ • డామునివృత్తిన్. ౩౨౨

క॥ దేని కది సరిగ నుండును
దానికిఁ జింతించుచుండ • ధైర్యము తొలఁగు౯
గాన౯ సర్వము బ్రహ్మము
నా నిత్యానంద మబ్బు • నమ్ముము జీవా! ౩౨౩

క॥ పరమాణువు మహదాత్మయు
వరుస న్నిపైన మేలు • వార్త౯ శ్రీస
ద్గురుముఖమున శ్రుత్యర్థము
పరమార్థముకొఱకుఁ దెలియుభక్తులఁ గొలుతున్. ౩౨౪

క॥ ఇద మిత్థ మ్మనరానిది
అది యెట్లో విడుదు నందు • రార్యులు భక్తిన్
మది రామపదము సతతముఁ
గుదురుగ గురుకరుణ నిల్పుఁగొను కోవిదునిన్. ౩౨౫

క॥ శ్రేయము గోరెడు జీవుఁడు
గాయంతం త్రాయత ఇతి • గాయత్రీ నాఁ
బాయక జపింపకే సదు
పాయము నరయంగ నేమి • పాపము రామా! ౩౨౬

క॥ నీతో నైక్యం బందక
చేతోమోదంబుకొఱకుఁ • జేసెడుపనియే
పాతకము పతనహేతువు
సీతాపతి! నీసపర్యఁచే ముక్తుండౌ. ౩౨౭

తే॥ గీ॥ తెలియునందాక నితరులఁ • దీర్పరాదు
ఎఱుఁగనప్పుడు పరులను • నెన్నరాదు
తెలియు నవ్వెలఁ దా నెట్లు • దిద్దుకొనునో
యట్లు యితరులఁ గని సాక్షి • యౌను సుకృతి. ౩౨౮

ఆ॥ వె॥ ఐక్యసిద్ధియొక్కఁ • డాత్మార్పణ మ్మొక్కఁ
డొక్కఁ డిష్టదైవ • మొనరఁ జేయ
మూఁడుమతము లగుచు • ముక్తిసోపానమ్ము
లనఁగ భక్తిరీతు • లతిశయిల్లు. ౩౨౯

క॥ సంసారివలె నటించుటఁ
గంసారిస్మరణ నాత్మకై వల్యమునన్
హింసారహితపథంబున
హంసలు విహరింతురి శాంతులై కలినైనన్. 350

క॥ శ్రీరామ రామ రామ సు
ధారసపానంబు బ్రహ్మతాదాత్మ్యం బీ
భూరిసుసాధన మనుచున్
ధీరులు నడవడియుఁ బల్కుఁ దెల్పు నిరూఢిన్. 351

క॥ తనమనమే తనబంధం
బునకున్ మోక్షంబునకును ముఖ్యం బగు కా
రణ మని పెద్దలు తెల్పఁగ
వినియున్ ధర్మంబు తెలియవే మూఢాత్మా! 352

క॥ నమ్మింపఁగ యత్నము వ్య
ర్థ మ్మది కాలగతి నైనఁ దద్విధినా ని
న్నమ్మిన నమ్మఁగఁ జెప్పుట
సుమ్మీ! సఫలంబు ధర్మసూక్ష్మము సుమ్మీ! 353

క॥ సతిసుతుల మనుచు నెవనిని
బ్రతుకన్ ధర్మంపురీతి బాధ్యునిఁ జేయన్
జతుర్థలో వారికి నాతని
వ్రతమే వ్రత మంచుఁ జెప్పువారలు లేరే! 354

క॥ పై చేయి వాని కెదురె
త్రేచాయలఁ జెల్లుఁగాక! ◆ యెటు చెల్లునొకో
యాచించువాని కయ్యది
ఛీ ఛీ! యధికారము మఱచి తిరుగ నగునా? ౩౮౫

క॥ తెలిసితిఁ దెలిసితిఁ దెలిసితిఁ
దెలియఁగ నింకొక్కఁ డిద్ది ◆ తెలుపు మనవుడున్
దెలియుట దబ్బుఱ కాదా!
తెలిసినవాఁ డాత్మమయతఁ ◆ దేజరిలుకదా! ౩౮౬

క॥ సలవేదంబులు శాస్త్రము
లిలఁ దెల్పెడు విషయ మొక్కఁ◆డే యైనన్ మూ
ఢులు తెలియుచుండ్రి గురువులఁ
బలుమఱు బాధించి క్రొత్త◆వానిన్ వలెనే. ౩౮౭

క॥ తెలిసిన సర్వము బ్రహ్మము
తెలియఁగ నిం కేది తిరిగి ◆ తెలియవలె నన్
దెలియుట దబ్బర కావునఁ
దెలుపుదు రింకొక్కసారి ◆ తెలిసినదానిన్. ౩౮౮

క॥ తెలిసినఁ దగు నడవడిరహి
వెలిబుచ్చన్ దాని ◆ వేనవేలు పలికినన్
ఫల ముండునె తపియింపఁగ
వలెఁగాక గురూక్తరీతి ◆ భక్తి విరక్తిన్. ౩౮౯

తే॥ గీ॥ ఎవుఁడు కలుగు నాత్మేచ్ఛకు ♦ నింత యడ్డు
జీవకాలాంఛనం బది ♦ చేవఁ జెఱచు
మోహమును బెంచు సంసృతి ♦ మునుఁగఁ జేయు
శివుఁడు గురువుగా రక్షణ♦సేయుదనుక. ౩౯౦

తే॥ గీ॥ మును సుయోధనుచేతఁ గా♦ననమునందు
నుండఁ బంపంగఁబడుటచే ♦ నొందె దుఃఖ
మకట! ద్రౌపది కాకున్న ♦ నంద యోకట
నున్న వనమైన గృహమైన ♦ నొకఁడుగాదె? ౩౯౧

ఆ॥ వె॥ పంజరంబునందుఁ ♦ బక్షి సుఖంబుగ
నున్నదనుకఁ బ్రాణ ♦ ముండునట్లు
రక్కసులకు రామ♦రాజ్యంబులో జీవ
తతికిఁ బరువియుండు ♦ బ్రదుకు తెలువు. ౩౯౨

ఆ॥ వె॥ బ్రదుకు తెలువుకొఱకు ♦ భగవంతు ధ్యానించు
బ్రదుకు తెలువుకొఱకు ♦ భక్తిసలుపు
బ్రదుకు తెలువుకొఱకు ♦ బలుకర్మములఁ జిక్కు
బ్రదుకు తెలువుకొఱకు ♦ బ్రదుకుఁ జచ్చు. ౩౯౩

ఆ॥ వె॥ సత్యమునకు మించు ♦ సద్వ్రతం బిల లేదు
సత్యవర్తనంబు ♦ సార మెన్న
సత్యముగఁ జరించి ♦ సత్యంబు దర్శించి
సత్యము కృతి యగు ♦ సాధుజగతి. ౩౯౪

ఆ॥ వె॥ తిన్మయుఁడు సమాధిఁ • దత్త్వసంపన్నుండు
బాహ్యదృష్టిఁగలిగి • ప్రబలెనని
పండితుండు లోక•బాంధవుం డాప్తుండు
జగతిఁ దిరుగుచుండు • శంకరుండు. ౩౯౫

తే॥ గీ॥ వట్టితలపులఁ జాలించి • గట్టిదైన
యీశ్వరేచ్ఛను నెఱనమ్మి • యీశ్వరార్ప
ణముగ సర్వముఁజేసి ధ•ర్మము భజించి
ప్రణవసంజ్ఞ సద్యోగంబుఁ • బ్రబలనిమ్ము. ౩౯౬

క॥ కింకర్తవ్య మ్మను దు
స్సంకోచముఁ దుంచి శాంతి•సౌరభ మెంచెన్
వేంకటపతి నా సుమనః
పంకజమున నిల్చి వేడ్కఁ • బండెఁ దపంబున్. ౩౯౭

క॥ దినదిన మొక్కొకరీతిగ
మన మది చలియించు వట్టి•మాటలఁ బెంచున్
ఘనయోగాలంబనమున
వనజాక్షున్ జేరి పడఁకి • పడఁకి హరించున్. ౩౯౮

క॥ పరులను నెంచుట మానిన
పరమతికిన్ స్వవిషయంబు • భ్రమ ముంపదు స
ద్గురు నుపదేశంబున శ్రీ
ధరుఁ డొక్కఁడు దోఁచుఁ బిదపఁ • దానై ప్రోచున్. ౩౯౯

తే॥ గీ॥ ద్వైత మద్వైత మొకరీతి ♦ వరలుచుండు
వినుచు వేళల వందిచ్చు ♦ వెనుకఁ బూర్ణ
భావ మద్వైతబోధంబు ♦ ద్వైతమునకు
ద్వంద్వసమితిని దాఁటించు ♦ వలను లేదు. ౪౦౦

క॥ చరమపురుషార్థ మొసఁగెడు
చరమశ్లోకార్థ మాప్తశరణము గనినన్
సరళంబుగఁ దెలియం దగు
నరునకు నుపదేశ మిచ్చు ♦ నారాయణుఁడే. ౪౦౧

తే॥ గీ॥ చుట్టుఁ జేర్చిన సామగ్రి ♦ గిట్ట దిరక
దూరదృష్టిఁ బరాత్మను ♦ జేరవలయు
ననుచు బోధించుఁగాఁబోలు! ♦ నబ్జభవుఁడు
దృష్టిభేదంబు నలువది♦యేండ్ల కొసఁగి. ౪౦౨

క॥ యోగాభ్యాసముచేయుట
చేఁ గల్గునె ముక్తి? నిందఁ♦జేయుటె పనిగా
రాగద్వేషాదులఁ దా
నాఁగన్ లేనట్టి ధీరుఁ ♦ డా గురుఁ గొల్చున్. ౪౦౩

క॥ వేగం బాపఁగరాదఁట!
వేగమునన్ బోవరాదు ♦ వెఱ్ఱికి వశమా?
యోగియు భోగియు నొక్కఁడఁ
గాఁగలవాఁ డల్ల శివుఁడు ♦ కాఁడా! వీఁడా? ౪౦౪

ఉ॥ లోకముఁ జూడనేల మన♦లోఁగల దేవుని నాశ్రయించినన్
శోకముఁబాయు నాక మగు ♦ శోభనలీల గృహంబు, భక్తిమై
సాఁకుదు రాత్మశాంతి నీఁకఁ ♦ జంచలవృత్తిని మాను, మాని ధై
ర్యాకరయోగసిద్ధిఁ గని♦హాయిగనుందుముమాయమాయమా.

క॥ భక్తియు సుమ్మాత్మీయత
ముక్తియు యాత్మత్వ మగు ము♦ముక్షువు రెంటన్
యుక్తుండై యాత్రన్ గురు
సూక్తిన్ దద్భక్తినలువు♦చున్ నడిపించున్. ౪౦౭

క॥ ఎట్టెట్టో తెలిసి తెలియక
పట్టున్ విడకుండఁ బరమ♦భక్తిఁ బ్రణవమున్
గుట్టుగ జపియించినఁ జే
పట్టున్ దను ముక్తికాంత ♦ పరమప్రీతిన్. ౪౦౮

క॥ తనయా కలి తా నెఱుఁగును
దన కెట్టులఁ దృప్తియగునొ ♦ తాన యెఱుంగున్
గని పరుల వారివలెఁ దా
దినుటయు పరధర్మ మగుట ♦ తెగులుం దెచ్చున్. ౪౦౯

ఆ॥ వె॥ అన్ని యున్నఁ దన్మ♦యత్వంబుతో నున్న
వాసుదేవ! సుకృతిఁ♦జేసి తండ్రి
తోఁచుచుండి సర్వ ♦ మూఁచుచున్న మనము
వాసుదేవ! వికృతిఁ♦జేసి తండ్రి. ౪౧౦

ఆ॥ వె॥ అనలలోచనుండు ♦ హరుఁ డని త్యజియింతుఁ
జ్ఞానలోచనుండు•నా భజింతుఁ
హరియుఁ జక్రధారి ♦ యని వీడెదరు సుద
ర్శనధరుండునా స•రస వసింతుఁ. ౪౧౦

తే॥ గీ॥ బొమ్మ, రామాయణము గాదు•సుమ్మ, వలువ
యనుచు, నది యుపయోగించు ♦ జనునిభంగి
జగము గా దిది బ్రహ్మంబు ♦ సత్య మనుచు
భోగపదముగఁ జేయు స•ద్యోగివరుఁడు. ౪౧౧

తే॥ గీ॥ తెలియకుండిన భేదంబు ♦ తెవులుతెచ్చుఁ
దెలిసియుండినఁ దత్త్వంబు ♦ ధీరుఁ జేయు
వలదు వలదని మఱియొక•వస్తు వరయు
వాఁడె వలదన్న దానిని ♦ వలచి నిలుచు. ౪౧౨

తే॥ గీ॥ జగముఁ ద్యజియింపఁ గననౌను ♦ శార్ఙ్గపాణి
ననుచు వెదకుట యజ్ఞాన ♦ మట్లు గాదు
జగము గా దిది కనిపించు ♦ శార్ఙ్గపాణి
యనుచుఁ దద్బుద్ధి నిలిచిన ♦ సమరు శాంతి. ౪౧౩

తే॥ గీ॥ నామరూపాదులందు ధ్యా•నంబు మాని
బుద్ధిమాఱిన మాఱును•బో జగంబు
పెండ్లియగుటకుఁ బూర్వంబు ♦ భేదబుద్ధి
దోఁచు పురుషుండె మగఁడైన ♦ దొడ్డవాఁడు. ౪౧౪

తే॥ గీ॥ ఉన్నదానికి మించిన ♦ దుండఁ బోదు
బుద్ధిమాలిన మాటలు♦బో జగంబు
బొమ్మ రామాయణము మాటె♦బో పటంబు
గాఁగ సర్వానుభూతికిఁ ♦ గల్ల కాదు. ౪౧౫

క॥ రూపాదులఁ బ్రాపించెడు
పాపంబుల దొఱలనీక ♦ బహుధా భవసం
తాపముఁ బాపఁగ నాకై
యోపికఁ దత్త్వంబుఁ దెలుపు ♦ నుత్తముఁ దలఁతున్. ౪౧౬

తే॥ గీ॥ కంటిలోని కంటఁ ♦ గలియఁజూచిన శుద్ధ
జీవుఁ డాత్మతోడఁ ♦ జేరి వెలుఁగు
నతని దేహ మీశ్వ♦రాలయం బానంద
దాయకంబు ప్రణవ♦సాయకంబు. ౪౧౭

క॥ కేవలతత్త్వజ్ఞానము
కావించు సహజసమాధి ♦ కావున 'జ్ఞానా
దేవ తు కైవల్యం' బని
వేవిధముల వేదవిదులు ♦ వినిపింత్రు గదా! ౪౧౮

క॥ హితదర్శనంబున సదా
గతి నిల్చెడు నుత్తములకుఁ ♦ గద శుష్కవచో
గతిఁ బరఁగెడు నీచుల మన
మతిరయమున రెంటఁ గల య♦థార్థముఁ గనుఁడీ. ౪౧౯

క॥ సత్తామాత్రం బగుట గు
రూత్తము బోధంబు భక్తు • నూరక మోక్షా
యత్తుఁ జేయును వాఁ డది
చిత్తంబున నెఱిఁగి విడు న•శేషార్థంబుల్. ౪౨౦

క॥ జీవముతో నున్నప్పుడె
వేవిధముల భంగపఱచి • వేఁదుదు రక్లే
జీవత్వభ్రాంతి కలుగఁగ
వేవిధముల బోధచేసి • వెలపింత్రుగదా! ౪౨౧

ఆ॥ వె॥ దిక్కుఁ గాంచుచుండు • ధీరుండు ముక్తుండు
దిక్కుఁ గాంచఁడేని • దీనుఁ డరయ
దిక్కు మ్రొక్కు లేమి • ధీసాక్షి తన్మయుం
డాత్మమూర్తి దేవుఁ • డందు రతని. ౪౨౨

తే॥ గీ॥ ఆత్మరూపంబు ద్రవరూప•మై ద్రవించు
దహరమంమున నిచ్చలుఁ • దగిలియుండు
శుద్ధజీవుఁ డాత్మానాత్మ • లుద్ధరించు
ముక్తిపర్యంత మత్యంత•భక్తి సక్తి. ౪౨౩

ఆ॥ వె॥ తత్త్వబుద్ధి లేని • ధన్యాత్ములను గటా!
కలియుగమున నేఁడు • కమలభవుఁడు
నిల్పియున్నవాఁడు • నేర్పుమైఁ దద్ధర్మ
మెఱిఁగి, యెఱిఁగి పరుల • నెంచ నేల? ౪౨౪

ఆ॥ వె॥ సర్వకర్మములను ♦ స్వాతంత్ర్యమా లేదు
ఫలముఁ జూతమన్నఁ ♦ బరుని దండు
దేనికొఱకు నరుఁడు ♦ దీనుఁడై ధీరుఁడై
పొంచుఁ, బోరు నీవ ♦ వంచమందు. ౪౨౫

క॥ కావున నిత్యధ్యానము
కేవలము క్షిప్రదంబు ♦ కృతకృత్యుంపా
జీవన్ముక్తుం డొక్కఁడు
భావంబున నిల్పు నున్న ♦ భావము గాఁగన్. ౪౨౬

క॥ ఎంచుట మాను ము ద్వంద్వము
లంచితజీవాత్మయోగ ♦ మబ్బఁగ నతముల్
బెంచుచు మంత్రధ్యానముఁ
గాంచుము సర్వార్థసిద్ధి ♦ కైవల్యంబున్. ౪౨౭

ఉ॥ దానము సూతపుత్రునకు, ♦ ధర్మము ధర్మనృపాలమౌళికిన్
మానము రాజరాజునకు, ♦ మంత్రముతంత్రముకృష్ణమూర్తికిన్
గానము నారదాఖ్యునకు, ♦ జ్ఞానము నానహదేవసూరికిన్
మౌనముయోగిచంద్రునకు, ♦ మాధవభక్తియుఁగ్రీడికెంతయున్
ధ్యానము గోపికాతతిక, ♦ హాస్య మదెల్లఁ దెనాలివానికిన్
గానలు తాపసావళికి, ♦ గాధలు వింతలుఁ బెద్దమాంబకున్
గోనలు దుష్టజంతులకుఁ ♦ గూరిమి పేదల, కెందునేఁ దపః
ప్రాణముఁ దీయుటన్నయది ♦ రంభకు మేనకకున్, సదా హరీ

జ్ఞానులు కూర్చు వైఖరినిఁ♦గాంచి తదీయగతిం జరింపఁగాఁ
బూనుదు రజ్ఞు లయ్యొ! యటు♦పూనినవారినిఁ బోలవచ్చునే
కానఁగ వారిగాథలకుఁ ♦ గారణ మజ్ఞులు బోధచేయుటే
కానివృథాభిమానమును♦గాదదియార్ష్యయుఁగాదు కాదుసూ
మానముఁ బూనలేమి ఖల♦మానవకోటి కథాళికిన్ బలెన్
మానుపు మిట్టిపోకడలు ♦ మాధవ! వ్యాధు లుపాధివాసనల్
దీనులు జీవు లన్న! భవ♦తీరముఁ జేర్పఁగదన్న! యెన్న నే
మేనియుఁ బూర్ణభావమున♦నెవ్వ రొనర్తురు నీ వొకండవే. ౧౨౭

క॥ నీభక్తులు నీమూర్తియు
నీభావము నీదుశక్తి ♦ నీగాథలు మా
కా భుక్తిముక్తిదంబులు
శోభనశైలాధివాస! ♦ సూరిహృదీశా! ౧౨౮

సీ॥ పాతకం బెందేని ♦ ప్రామాణికుండైనఁ
గావ్యపఠనమందుఁ ♦ గలుగు నీతి
వారివీరినిఁ బోల్చి ♦ వైఖరి నెన్నిన
మంచికృతినినైన ♦ మత్సరంబు
ప్రాప్తించుఁ 'బర్జన్య♦వ ల్లక్షణప్రవృ
త్తి' యను సూక్తిని జగ♦తి వినలేద?
ఒకరిపొలము ముంప ♦ నొకరిపొలముఁ బెంప
వలచునె, యేటిప్ర♦వాహగరిమ

సహజకవితాప్రవాహంబు ♦ సాధురీతి
మేలు లెంచక మించ నిమిత్తకల్ప
నంబు కూడున దాన దోషంబు పెంపఁ
గూడునే యనహానమునఁ ♦ గొఱఁతవమట.  ౪౩౦

ఆ॥ వె॥ కడుపులోనిశిశువు ♦ వెడలునపుడుగాదె
తోఁచు బరువు బాధ ♦ తోఁచుచుండుఁ
దల్లి కట్లుగాక ♦ తనకడుపున నున్న
యపుడు బాధకలదె? ♦ యట్లు వినుము.  ౪౩౧

ఆ॥ వె॥ సాంబుతోడఁ గలిసి ♦ యానందమును బొందు
వేఱుగాఁగ నిలిచి ♦ వెతలఁ గుందు
జీవుఁ డట్లుకాన ♦ శ్రీవిద్యఁ బావనుం
డైన నాత్మలీనమైన శుభము  ౪౩౨

తే॥ గీ॥ శుకము శాల్మలిఫలముకొఱకు భజించుఁ
గప్ప మ్రింగెడుపామును ♦ గడఁగి ముంగి
మ్రింగుఁ, జూడఁజూడంగ, సంసంగబాధఁ
జేయు నెద్దైన మానును, ♦ సిద్ధ మవని
జంతువులతమమునకు ననంతకామ
మునకు నీర్ష్యకు నాశకు ♦ మొదలుఁ దుదియుఁ
గానరా దెందు నేమందుఁ ♦ గర్మమందు
లోన దోషంబుఁ గల్పించి ♦ ప్రాణితతికి

దాని కనువగు నిం కొక్క • దాప్త్యమునకుఁ
బాలుపడఁజేసి మఱియొక్క • పాళిని రెంటిఁ
గూర్చి సంసారమునుఁ బ్రీతిఁ • బేర్చుచుండు
దైవవశమున మేధావి • ధాత యౌర!
గుణము లవ్విధిఁ గల్పించు • కోవిదుండు
తెలిసి, యింతయు సాక్షిగఁ • గలఁతలేక
సూచుచుండును, నజ్ఞుండొ • యూచుచుండు
మనము నెంతేని ద్వంద్వంబు • లనుభవించు
చుండు నవ్వుడుఁ దనవిగా • నున్న వనుచు
నొచఁ జెందేని తనయందు • నుంచు బ్రహ్మ
మంచుఁ గాన శాంతించి సత్యంబు మించు
దేశికోత్తమపుత్రుండు • ధీరుఁ డొకఁడు
నిదు భక్తుండు యుక్తుండు • నీరజాక్ష!
హరి! త్వదీయసద్భక్తి మహాత్ముఁ డగుట. ४३३

తే॥ గీ॥ కార్యకారణసరణి నిష్కారణముగ
మానవుండు తా దానినిఁ • గానఁగల్గుఁ
గూడియుండినవఱ కెట్లు • కూడు పుట్టుఁ
బెరుగుటయుఁ బుట్టుట యురయ • నరునిభ్రమయ ४३४

ఆ॥ వె॥ పురుషు నాశ్రయించుఁ • బువ్వుఁబోడి ప్రకృతి
పూర్ణ, చిత్రి, చల, యపూర్వముఁ గన,
నాదిగాఁగ నునికి, • నాత్మ పుట్టకునికిఁ,
బుట్ట గిట్ట నెద్ది • వట్టిమాట. ४३५

తే॥ గీ॥ గురుముఖంబున విద్దెలఁ గొన్ని చదివి
యుంట నపుడపుడు కలుగుచుండు బుద్ధి
ఉగ్గుతోఁ దానుఁ దలిదండ్రు లూర కెపుడుఁ
బోయు దుర్బుద్ధులకు లొంగిపోవునపుడు
దుష్టమతి తలయెత్తు విద్యుత్తువోలె
మంచి చెడ్డగఁ జెడ్డను మంచి గాఁగ
నెంచి విశ్వంబుఁ దనను వంచించుకొనును
గలయఁజూచిన లోకంబు కల్లకాదె?
దాని మెప్పించుయత్నంబు దబ్బర యగుఁ
బండితమ్మన్యులకుఁగాక భక్తకోటి
కేల చర్చలు? లోకంబు లేల? చాలు
నిజసమర్థత నమ్మి యొన్నెని వలలఁ
బన్ని పన్నుకొనంగ శుభంబు భంబు. ౪౩౭

తే॥ గీ॥ సకలసత్సంప్రదాయవిశ్వాసభూజ
భక్తిసూన మాచార్యసత్సూక్తి శక్తి
సారము హృదయపీఠిని విస్తారగరిమఁ
బూర్ణశాంతి ఫలంబై యెపుడు చ్యుత మగు
నపుడె జీవేశ్వరైక్య మనర్గళముగఁ
గలుగు నైక్యంబుగాదె యాకాశములకు
స్థానమును గుణమొక్కఁడై జరగుకతన

నుండి లేకుండు టది భక్తియుత్తమంబు
రాధసాధనంసిద్ధా హంరా! రమేశ! ౪౩౭

క॥ గోపూజ విప్రపూజయు
గోపాలకుపూజయట్లు ♦ కోవిదు లెఱుఁగన్
పాపముఁ గట్టుకొనం దగుఁ
నే! పశువులఁ బాడితులను ♦ నేఁచి యెవండేన్. ౪౩౮

ఆ॥ వె॥ ఎంచి చేయఁదగిన ♦ దించుకేనియు లేమిఁ,
జింతమాని ప్రణవ♦మంత్రమూని
తజినిఁ దగినరీతి ♦ దఱలుచు మఱలుచు,
విష్ణుపాదమందు ♦ వేదియుందు. ౪౩౯

క॥ పలుకులు పలుకులు పడిపో,
నిలుచుట నిలుచుటయె వట్టె♦నేర్పు లవేలా?
యిలఁ గనులు గనులు గురుఁడై
కలవానిగ హరియు చేయఁ♦గలవాఁడై నన్. ౪౪౦

తే॥ గీ॥ చర్చచే జ్ఞానవహ్నిని ♦ నార్చుచుండుఁ
జర్చచే నన్నికోర్కులు ♦ దీర్చుచుండుఁ
జర్చచేఁ బాపసంతతిఁ ♦ గూర్చుచుండుఁ
జర్చవిడిన బుధుఁడు నెఱ♦వేర్చుచుండు
నుచితభంగిని దత్తత్వ♦యోగమునను
సర్వవిధముల సర్వంబు ♦ సర్వులకును

సతినిదర్శనమాత్రాన • నడఁగు నఘము
వానిస్పర్శనమాత్రాన • వాడు భవము
అతనియాశీస్సుమాత్రాన • నతిశయిల్లు
నిత్యకళ్యాణజనకశాం•తిస్వ మదిర. ౪౪౧

ఆ॥ వె॥ ధర్మవృత్తి భక్తి • ధైర్యంబు సత్యంబు
దహరమందు సతముఁ • దగులుకొంట
సమరసంబు సాధు•సన్నిధి నిశ్చింత
తత్త్వ ముండెనేని • తపము పండు. ౪౪౨

క॥ ఒడ లెఱుఁగక క్రీడించుచుఁ
బడలిన విబుధుండు శిశువు•వలె సహజముగా,
వడి చెడఁ దడఁబడ కంబక్
గడుఁగొల్చుచు నాత్మశాంతిఁ • గడతేఱుఁగదా! ౪౪౩

ఆ॥ వె॥ ప్రణవ మీశ్వరుండు • ప్రారబ్ధమే ధర్మ
మగుట రెండు రెంటి • నంటియుండ
జీవత విడునంత • దేవుండు భాసిల్లు
స్వస్వరూపయోగ•శక్తి ముక్తి. ౪౪౪

క॥ సంసారద్రుమబీజము
కంసారిన్ మదినిఁ జేర్చి • కలకాలము స
చ్ఛంసనమున్ గాంచిన వి
ద్వాంసుల సద్భక్తిఁ గొల్చి • తత్త్వ మరసితిన్. ౪౪౫

క॥ తెలియుట తెలియకపోవుట
తెలియం జెలిపెద ని కెద్ది ♦ ధీరుండను నే
వలనఁ జప మాత్మంగా
జెలియఁ దా ధర్మబుద్ధి ♦ తెలియదు తానై. ౪౪౬

క॥ పరులను దమకోఱ కట్టులఁ
బరులకునై తమ్ముఁబట్టి ♦ బాధింపఁగలా
దురుయత్నంబున నరు లీ
పరమరహస్యంబుఁ జెలిసి ♦ పలికెద వేలా? ౪౪౭

క॥ మాయగఁ బ్రకృతిగ మనముగ
జాయగ వాక్కుగ సుషుమ్న♦చాడ్పున సుకృతీ
న్యాయమ్ముగ మాతాప్రకృతి
నే యుంటివి పొగడనేర్తు♦నే నిన్ను శివా! ౪౪౮

క॥ తనుఁ దా వీడిన జీవుని
గని తారక మొసఁగి ప్రీతిఁ ♦ గాచెద వని నే
వినియున్న దాని నిప్పుడు
గనుఁగొంటిఁ జ్ఞానముద్ర ♦ కైవల్యంబున్. ౪౪౯

ఆ॥ వె॥ అపరాశక్తి శివునికే ♦ నలవికాదు
కర్మమును గర్మసాక్షియేఁ ♦ గడవలేఁడు
స్వల్పబుద్ధినిఁ బుట్టు సం♦కల్పవితతి
దేని నెవ్వ డెట్లు గడవంగఁ ♦ బూను నెవఁడు? ౪౫౦

ఆ॥ వె॥ వస్తుదృష్టి లేని • పరమార్థ మది సున్న
వస్తుదృష్టి యున్న • వాంఛ సున్న
వస్తుదృష్టిచేత • వర్ధిల్లు నాత్మాభి
ముఖుఁడు తానె యాత్మ•ముగ ధరిత్రి. ౪౫౧

ఆ॥ వె॥ తత్త్వదర్శనంబు • సత్త్వసమగ్రంబు
సమరసంబు సాధు•సమ్మతంబు
జగతిఁ గల దోకండు • సమరసాభాసంబు
నన్నియన్నిటికిని • నగుట తగునె? ౪౫౨

ఆ॥ వె॥ తత్త్వబుద్ధి సర్వ•తంత్రంబులందునఁ
గర్మ మాఁగ శాంతి • కలిమి బలిమి
వాంఛ సంతతభగ•వద్భాగవతసేవ
* నూదుచుండు ప్రణవ • మూర్ధ్వగతికి. ౪౫౩

ఆ॥ వె॥ తా నహంకరించి • తనయునివలెఁ బెంచి
తత్త్వము వినిపించి • ధర్మ మెంచి
కంట నీరునించి • గారవించిన మంచి
నేత తరమె ధాత•వ్రాఁతలేమి. ౪౫౪

గీ॥ చూచినంతనె ధన్యాత్ముఁ • జోద్యముగను
శాంతిమూర్తిభవించె నట • భ్రాంతిఁ గలుగు
నితరభ్రాంతులఁ దొలఁగించు • నిట్టి భ్రాంతి
భ్రాంతియేగాదు సంపూర్ణ•శాంతిసుమ్ము! ౪౫౫

---

* ఇక్కడఁ గలిగి యనునది యధ్యాహారము.

క॥ అనుబంధచతుష్టయము గ
మనించిన విరాగి ముక్తి • మాధవుభక్తిఁ
గనియెడునఁట! సౌకర్యము
పనివడి నిజధర్మమునకు • బయలువడెడు దోన్. ౪౫౬

ఆ॥ వె॥ ఎల్లు చేయ నేమి • హితుఁడైన యప్పుడు
ఎట్లు చేయనే మహితుఁడైనఁ
జేత లేమి సేయుఁ • బూతలు రోఁతలౌ
సత్యవర్తనంబు • సమ్మతంబు. ౪౫౭

క॥ హెచ్చుగ నొక్కఁడె బ్రహ్మం
బచ్చంబుగ వెల్గు నెప్పు • డందురు జీవుం
డెచ్చట గనరాఁ డందురు
చచ్చిన యటు లుండ నే మసాధ్య మతనికిన్? ౪౫౮

ఆ॥ వె॥ వట్టివేష మంచు • గట్టిగాఁ దెలిసినఁ
బట్టుదలలు తలలఁ • బుట్టఁబోవు
పట్టుదలలు మానఁ • బుట్టవు కోర్కెలు
కోర్కెలేనివాఁడు • కోవిదుండు. ౪౫౯

తే॥ గీ॥ ఎంతదాఁక నహంకృతి • యేఁచు జనులఁ
దన్మయత్వాన నందాఁకఁ • దగులకుండ్రు
దాన దోషంబు వాటిల్లు • ధర్మవృత్తి
నుండువారె జీవన్ముక్తు • లండ్రు బుధులు. ౪౬౦

తే॥ గీ॥ లేని యహా మను పశువును ♦ లేనియట్టు
లున్న యహా మను బ్రహ్మంబు ♦ నున్నయట్లు
చేసి యుభయధా సంపూర్ణుఁ♦డై సుఖంప
నిత్యమగును జీవన్ముక్తి ♦ సత్యమగును. ౪౬౧

తే॥ గీ॥ ప్రశ్నభాగంబు విడువురా ♦ పాపి! యింక
ధర్మమార్గాన నడువురా ♦ ధైర్యశాలి!
శాంతి సమకూరు సర్వంబు ♦ సఫలమగును
నిత్యమగును జీవన్ముక్తి ♦ సత్యమగును. ౪౬౨

ఆ॥ వె॥ అర్చనంబుకన్న ♦ సర్పణం బది లెస్స
దానికన్న లెస్స ♦ తత్త్వబుద్ధి
కలిగి యైక్యసిద్ధి ♦ కలిగి కర్తవ్యంబు
కరణ మ్ముల్లు లేక ♦ కలిగి యునికి. ౪౬౩

క॥ ప్రణవము జపియించుచు భవ
మును దాటంగోరి నీదు మూర్తి బుధు డు తా
ల్చును దనువే తత్త్వం బని
యనిమొద రాతండు నీవ ♦ యనియుఁ నృహరీ! ౪౬౪

తే॥ గీ॥ ఈశ్వరానుగ్రహంబున ♦ సేపుమీఱఁ
బరమగురుసేవ విజ్ఞాన♦బలము గలిగి
భక్తి నావగఁజేసి తా ♦ భవమహాబ్ధి
దాఁటు దాఁటించు దాసుల ♦ ధన్యతముఁడు. ౪౬౫

తే॥ గీ॥ ధర్మమే యవతారంబు • దాల్చినట్లు
తనరు శ్రీగురుస్వామి ముం•దరను నిల్పు
కొని తదీయునై లిని భజిం•పు నిరతంబు
స్వస్వరూపానుసంధాన•సరణి యిద్ది. ౪౬౬

ఆ॥ వె॥ యుక్తిమీఁద యుక్తి • నూహింపుచున్నచో
ముక్తి వచ్చు నొక్కొ? • మోహ మెచ్చు
నిలిచి యొకట నెట్లొ • నెఱనమ్మి గురుసూక్తి
నభ్యసింప నాత్మ•యై తనర్చు. ౪౬౭

తే॥ గీ॥ తత్పరత్వంబునను మించుఁ • దన్మయుండు
భక్తశేఖరుఁ డెల్లెనఁ • బావనుండు
వానిచర్యలఁ జర్పింప•వశమె మనకుఁ
గేవలము మానుషాకృతిఁ • గేవలుండు. ౪౬౮

వసంతర్తువు.

క॥ ప్రాక్తనవాసనలన్ గురు
శక్తిన్ బోఁదోలి నూత్న•సామగ్రిసం
యుక్తుల భోగాసక్తుల
ముక్తులఁ జేయు ఋతురాట్టు • బుధులు నుతింపన్. ౪౬౯

గ్రీష్మము.

క॥ భోగికుల మతులగతి సం
భోగంబుల మున్గి లేవఁ•బోలునె యుని యు
ద్యోగంబున భీష్మంబుగ
రేఁగున్ గ్రీష్మంబు తెలియ•రే భువి రసికుల్. ౪౭౦

## వర్షాకాలము

క॥ బా గొనరించుచుఁ బిల్లల,
కేఁగిన కోవ మవలఁ దమ•రె యడఁపరె, గురుల్!
కేఁగుటఁ గాలము తానై
యాఁగదె వర్షింపసాఁగి • యధికప్రీతిన్. ౪౭౧

క॥ గురుబోధామృతవర్షము
నరునకుఁ దనలోని వాస•నాబీజంబుల్
స్ఫురియింపఁజేయు చాడ్పున,
ధరఁగల యోషధుల వాన•తరి ప్రకటించున్. ౪౭౨

## శరత్తు

క॥ ఆకాశము సహృదయహృద
యాకాశము మబ్బుపోక • హరిపదతీర్థం
బేకడఁ జూడ నగస్త్యుని
రాక శివార్చనమునకు శ•రన్నిశలందున్. ౪౭౩

## హేమంతము

క॥ కామంబున సమకూర్చిన
సామగ్రికి వడఁకి విడువఁ•జను యోగుల నీ
హేమంతము వడఁకించుచు
రామాశ్రియ మబ్బఁ జేయు•రా, గురునిక్రియన్. ౪౭౪

### శిశిరము

క॥ తనవన్ని విడిచి యాత్మంగ
నునికిం గల యతినిం బోలి • యుర్వీరుహముల్
గనం దమతమవన్నియు రా
ల్చును శిశిరంబున వసంతలోలత్వమునన్. ౪౭౫

### సూర్యోదయము

క॥ పంకంబునఁ బుట్టెనని
జంకెడు పద్మినికి ముక్తి • సమకూర్పంగా
శంకరసహస్రకరుఁడై
పొంకంబున మిత్రమూర్తి • పొడసూపుఁగదా! ౪౭౬

క॥ వేవిధములఁ దలసూపెడు
జీవులతమముఁ హరించి • సిద్ధులఁ జేయన్
గావలయు వేయిచేతుల
తో వచ్చెదు నిత్య విభావు • తోయజమిత్రా! ౪౭౭

### సూర్యాస్తమయము

క॥ నిజతేజోమహిమం బది
సుజనులు ప్రార్థింపఁగఁ బొడసూపుచు నది శాశ్వ
ఋజుగతి దివ్యసమాధిన్
భజియించఁగ హంస కస్తమయ మందు రిలన్. ౪౭౮

చంద్రోదయము

క॥ అమృతాబ్ధిని శయనించును
గమలాపతి యోగనిద్రఁ • గమలజుఁ డతఁడై,
సుమి! సృష్టించు నను జగము
తమి నగు ప్రకృతిముఖ శశి చం•దలఁ దలసూపున్. ౪౭౯

చంద్రాస్తమయము

క॥ ఆనందమయుఁడు ద్విజుఁ డగుఁ
గానఁ హార్దంబుఁ గొల్పి • కడతేఱఁగ వి
జ్ఞానప్రకాశకు హరినిఁ
దా నై జంతులకుఁ జూపు•తఱిఁ బూర్ణుండౌ. ౪౮౦

ఆ॥ వె॥ కంబమందు హరినిఁ • గనియెఁ బ్రహ్లాదుండు,
తనకు నెదుట నిలువఁ • గనఁడు తండ్రి
ఈశ్వరేచ్ఛవలన నే•ద్దేని సిద్ధించు
నాత్మయందు నాత్మఁ • జూడుచుంట. ౪౮౧

ఆ॥ వె॥ పురుషుఁ డెవఁడు పరమ•పురుషుండు విష్ణుండు,
దక్క జీవుఁ డనఁగ • దబ్బరసుమి!
ఊరకున్నఁ దత్త్వ ముత్త•మోత్తమముగా,
వెలయుచుండు నాత్మఁ • గలియుచుండు. ౪౮౨

ఆ॥ వె॥ ఊరకుండి యుండి ♦ యూహించి చెడకుండ,
నుండి ధీప్రికాశ♦కుండు హరిగ,
నాత్మఁ దెలిసి భక్తి ♦ నాత్మార్పణము చేసి
స్వస్వరూపమందు ♦ స్వామిఁ గఁదు. ౪౮౩

ఆ॥ వె॥ చింతమాని పరమ♦శాంతిఁ బూనిన వాఁడు,
వాఁడు భవము, భవుఁడు ♦ వాఁడు ధ్రువము
ఆత్మమయున కాత్మ ♦ కంతరంబే లేమి,
భక్తి యిట్టి దనుచుఁ ♦ బలుకఁగలమె? ౪౮౪

ఆ॥ వె॥ తెలియునంతవఱకుఁ ♦ గలదు యుక్తియు సూక్తి
తెలివి లేనియపుడు ♦ తెల్లమొగము
తెలివి పూర్ణమైన ♦ దేదీప్యమానమై
యాత్మమయత భక్తి♦యౌ శుభంబు. ౪౮౫

తే॥ గీ॥ ద్వంద్వములకెల్ల నాత్మ యా♦ధారమగుట
నాత్మ సర్వత్రి నిత్యమై ♦ యలరుచుంట
గురుని కృపచేత నంతర్ము♦ఖుండైన
శిష్యునకు సర్వసంకల్ప♦సిద్ధినమ్ము! ౪౮౬

తే॥ గీ॥ అన్నిరూపంబులును స్వర్ణ♦మందుఁ బోలె
నన్నిశక్తులు నన్నింట ♦ నణఁగి యుండు,
స్వేచ్ఛఁ గృతి బయలుపరుప ♦ నెద్దియేని,
కలుగు డాఁచిన డాఁగును ♦ గలనిజంబ

దిట్టు లుండంగ నెట్లిన • నెన్ను నేల?
కృతివిలాసంబుఁ గాంచి సు•కృతివి కమ్ము,
జీవుఁడా! చింతమానిన • శేషభూమ
ణుండె స్వపదంబుఁ దా నిచ్చు • నందు శాంతిఁ,
గాన జీవయాత్ర నడుపు • కాలమందుఁ
బట్టుదల మాని తగురీతి • భ్రాంతి లేమి,
నుత్త సంసార మెట్టులో • నుత్తముండు,
చేయు నూరక యాత్మసం•సిద్ధిఁ గాంచు,
సహజముగ నద్దియే సుమ్ము • సమరసంబు,
సహజ సమరసమూర్తి ప్ర•శస్తకీర్తి.  ౪౮౭

క॥ చల్లని వర్షపుధారలు,
చిల్లరవాగులుగఁ గూడి • చిత్రగతి నెటో,
పల్లముఁ జేరియు నదులై
యుల్లల్లనఁ జేరుచుండు • నంబుధి నంబా!  ౪౮౮

గీ॥ పిల్లని నడవడియటులే
కల్లయయిన సత్త్వమైనఁ • గలుమంబై నగా
జల్లని నీకృపధారల
నెల్లప్పుడు నీపదంబు•లే గుఱిఁగాంచున్.  ౪౮౯

క॥ గురుపుత్రుఁడు వరభక్తిన్
గురుపత్నివాహములు జలధిఁ ♦ గూడెడు భంగిన్
బర మర్థించును నిన్నే
బరమానందలహరివి♦భవకాముండై. ౪౯౦

క॥ ఆర్తిన్ వారియింపఁగ నీ
మూర్తిన్ దర్శింప ధర్మ♦మూర్తి ధరింపన్
గర్తవ్య మరయ సద్గురు
మూర్తిన్ బోలుటయె మూఁడు♦మూర్తుల రంగా! ౪౯౧

తే॥ గీ॥ తప్పులను దిద్దుకొనుచుంట♦తప్ప వేఱు
పనికిఁ బూనమిఁ గాబోలుఁ! ♦ బరమపురుష!
నిలివిపోయెను మనసు, సం♦దేహ మేల?
సచ్చిదానందమయము వి♦శ్వమ్ము సుమ్ము! ౪౯౨

క॥ నీదికొ్క గురుపుత్రుం
డే దృక్కొ, వాఁడ యెఱుఁగు ♦ నెల్లజగములన్
దాదాత్మ్యబుద్ధి దనయెడ
నే దర్పణమందుఁబోలె ♦ నెపుడు మురారీ! ౪౯౩

క॥ దృక్కన్నను నహ మన్నను
నొక్కఁడు గావునను నందు ♦ నున్నది సర్వం
బిక్కడ నక్కడ వెదుకఁగ
నక్కఱయే లేదు రామ! ♦ యది నీవె సుమా! ౪౯౪

క॥ నీపాలనమునఁ బెఱుఁగుట
సేవనియుర్ణ మాకు నేల? ♦ హిత మెటొ యటులే
నీవ్రిజలర్ణ నడిపించెదు
శ్రీపతి! సుమనోగతీవ♦శీకృతనృపతీ! ౮౯౫

క॥ ఈపగిదియె యం చెవ్వం
డోపును స్థిరపఱుపఁ ♦ దనదు నుద్యోగంబుర్ణ
నాపత్రితినలతో నే మిఁక
నీపుతిర్కన్న న కతన ♦ నీనడకనుమీ! ౮౯౬

ఉ॥ మాకిఁక నిన్నుఁగొల్వవలె♦మాగురుసూ క్తిభజింపఁగావలెర్ణ
లోకము పీడఁగావలెను ♦ నూర్లయుగంబులకేఁ దపంబుచే
నీకరణిర్ణ సదా నిలచి ♦ నిశ్చలవృత్తిని నీవ కావలెర్ణ
లోకహితైకరక్షణవి♦లోలమతీ, సుగతీ, రమాపతీ! ౮౯౭

—♦ చంపకమాలిక ♦—

దయయునుసత్యశౌచములు ♦ దాంతియుశాంతియుదానధర్మము
ల్జయము ప్రిభుత్వముం ధనము ♦ శాశ్వతకీర్తియుఁ దత్త్వబోధము
న్భయమునఁ గోరు దీనుఁడు భ♦వత్పదభక్తివిహీనుఁడే కదా!
నయముగ స్వాత్మ ని న్మరుఁగ ♦ నమ్మిక నర్పణసేయువాని క
వ్వియుగు స్వధర్మముల్ నిజము ♦ వేంకటనాయకభక్తుఁ డీశుఁడౌ
నయుతయుగంబులేనొరుల ♦ నాదుచుఁబొర్దిద్దులుపుచ్చుచుంటవే
నయరహితుల్ గనం గలరె ♦ నాశవివర్జిత! నిత్యశోభనం

బయరొ! వృథాభిమానమున♦నా ర్తిహరించునెము క్తిమించునే!
వ్యయమొనరింపఁగాఁదగునె♦యాయువు చంచల మద్ది శ్రీహరీ!
రయమున దేశికో క్తవిధి ♦ బ్రాహ్మణవృ త్తిని మాకు నిత్యత
న్మయత ననుగ్రహింపుము ర♦మాపతి! సద్గతి! రామభూపతీ!

క॥ ఎంతటివైక్యంబో శ్రీ
కాంతా! మన కిరువురకును ♦ గనుఁగొంటిఁగదా!
యంతయు నీ వని తెలిసిన
యంతన్ సంసృతి దొలంగు ♦ నది యొక్కటనే. ౪౯౯

తే॥ గీ॥ మలినజీవుండు తొలఁగెను ♦ మానముదిగిఁ
దాల్చి శుద్ధజీవుండు తాఁ ♦ దపము సేయు
చున్నవాఁ డింద సద్భ క్తిఁ ♦ బన్నగపతి
నగపతీ! భవదిచ్ఛ నే♦నడువ నడుప
సాక్షివై నిల్చి పొల్చు మో♦క్షాధికారి. ౫౦౦

క॥ నమ్మిచు గురువరుపదముల
నో మ్మను నన్మంత్రినియతి ♦ నుత్సాహముతన్
నెమ్మది ని న్నీభక్తా
ఘమ్ముం భజియింపనిమ్మ ♦ కరుణ మురారీ! ౫౦౧

క॥ తనుఁ దాను విడిచి యైనన్
ఘనుఁ డెట్లో నిన్నుఁ జేరుఁ♦గద భళిరే! క
న్గొనఁ దన్మార్గముఁ బొంధుఁడు
విను నేతయు నీవ యెవరి♦ వేడఁగ నేలా? ౫౦౨

క॥ వ్యతిరేకవ్యక్తులతో
నతిశీఘ్రం బైన గతిని • నాఁడెడువో నీ
చతురత భ్రమపడు జీవుల
నతులిత గురుకృపను దేలుపుదూ హరి! నీవే. ౫౦౩

తే॥ గీ॥ అచ్యుతుఁడు మిత్రుఁ డత్యంత • మలరఁజేయఁ
బరమభద్రంబు నీ పాద•పంకజంబు
భవదవాగ్నిని జరరాగ్నిఁ • బాపుచుండు
నద్దిరా మాకు నద్దిర • యా ప్రభావ! ౫౦౪

క॥ ప్రకృతంబు ననుసరింపుచు
వికృతిం బొందక స్వధర్మ•విహితము లోకో
పకృతి నొనరించు భక్తుఁడు
సుకృతిగదా! నీవు కోరు•చొప్పున మెలఁగన్.

శా॥ నానాచిత్రవిచిత్రకల్పనలచే • నష్టాత్ములై వర్ణ భవ
ద్ధ్యానానక్తుల ముక్తులం బొనరుపక • ధర్మార్థ మెప్పట్టునన్
నానామూర్తులు దాల్చుచుంటయది నీ•నైజంబునావిందు వి
జ్ఞానాంభోనిధి! నీదు సన్నిధిని వే•కల్పింపురా శ్రీధరా!

శా॥ నీతో నైక్యము కల్గు భక్తులకునం•దేహంబులున్ దేహము
ల్చేతో వీథినిఁ గానరావుకద! తల్లీ ముక్త లవ్వారికిన్
నీతుల్ ఖ్యాతులురోతపూతిలగుట•న్నిర్నిద్రమానోద్భవ
త్స్వాతంత్ర్యంబునఁ గ్రీడ సల్పుదురు వి•శ్వశ్రేయము
జేయుచున్. ౫౦౫

క॥ భక్తులకుఁ బుట్టు గ్రంథము
రిక్తుల కవ్విధినిఁ దెలియ • లేవగలుగ శు
ష్కోక్తుల ముక్తిం గను నా
సక్తిగ విడువంగ భక్తి•శక్తియుఁ బొడమున్. ౫౦౮

శ్లో॥ అమృతానందనాథాయ, నాథాయ దృఢచేతసామ్
చేతఃప్రీతిప్రదానాయ, జ్ఞానాయ మహసే నమః.

గద్యము.

ఇది శ్రీమదమృతానందనాథ గురునాథ బోధ
సుధాబ్ధికన్యాధవ పదాబ్జసేవాలబ్ధ మనీషాజని
తోభయభాషా కవితాభూషాలంకృత
విద్వత్కవితిలకాయమాన
కనకకవితావిశారదావిర్భూ
తానందసారాఖ్యతత్త్వప్ర
తిపాదకమహాకావ్యంబు
సర్వంబు నేకాశ్వాసము
సంపూర్ణము.

శ్రీరామ

# పద్యానుక్రమణిక.

శ్రీతిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము.

## విద్యాశాఖ

---

# "కవితిలక గ్రంథమాల"

---

శ్రీమతి కవితిలక, కవితావిశారద కంచనపల్లి కనకాంబగారి

## గ్రంథములు

---

## పండితాభిప్రాయములు.

1926 సం॥ము ఫిబ్రవరి 8 వ తేదీ చెన్నపురి సభ.
అధ్యక్షు లగు కింకవీంద్రఘటాపంచానన శతావధాని
చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి యుపన్యాసమునుండి

---

"ఈ జీవయాత్ర" పుస్తక మిటీవలనే చూచి యందుపై నాకుఁ దోఁచిన భావమును వ్రాసితిని. మే మభ్యసించిన విద్య వేఱు. ఈయమ్మ విద్య వేఱు. ఈయమకుఁ బాల్యమందే వైరాగ్యము కలిగినది.

ఈమె తత్త్వవిషయము వ్రాసినది. మఱియు నీమె యనుభవముచే నంతయు సంగ్రహించినది. ఇందు మాకే కొన్ని భాగము లన్వయించుట లేదు.

ఎట్టివారి కవిత్వమందైనను బ్రమాదము లుండవచ్చును. కాళిదాసుని కవిత్వమునందును గొన్ని ప్రమాదము లున్నవి. "ఒకని కవిత్వమందెనయు నొప్పులు తప్పులు ..."— అని ప్రతిన పట్టిన ప్రాచీన కవిశ్రేష్ఠులలో నొకఁడగు తెనాలి రామకృష్ణుని కవిత్వమందును వెదకిచూచినఁ దప్పులు లేక పో లేదు. కావునఁ దప్పులు లేని వా రుంట యరుదు.

అట్లే యీగ్రంథమునం దొకచోట నొక శ్లోకములో "నః పాతు" అని ప్రయోగింపఁబడినది. ఇది సామాన్యముగఁ గోచరించు తప్పు కాదు. ఈమాత్రము దోషము దోషము కాదు.

ఇకఁ దెల్గులో నట్టి దోషమును గానిపించదు—ఈ మాట యావజ్జీవము సమర్థింపఁగలను.

"కం॥ ఓమ్మన నాత్మార్పణమగు" అనుపద్యమున "అవ" యను ధాతువునుండి ఓమ్మను రూపము వచ్చిన దని కవయిత్రి వ్రాసిన సందర్భమున నామె సంస్కృతభాషాజ్ఞానము మిక్కిలి కొనియాడఁదగినది.

స్త్రీ ఇట్టిప్రౌఢగ్రంథమురచించుట నిజముగఁబ్రశంసార్హము.

---

3

## బ్రహ్మశ్రీ కవిసార్వభౌమ
## శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి యుపన్యాసమునుండి

---

కనకమ్మగారి కవిత్వమునం దెట్టి దోషము లేదు. ధార యనర్గళము స్త్రీలు కవిత్వము చెప్పఁజాల రను వాదము తప్పు. బ్రాహ్మణులుతప్ప తక్కినవారు కవిత్వమును వ్రాయ లేరని కొందఱు తలఁచెడివారు. కాని రామరాజభూషణుని కవిత్వము జగన్నుతిఁ బడసియుండలేదా? కవిత్వమునకుఁ గులముగాని, స్త్రీపురుషభేదములుగాని లేవు నేటికాలమున షుమారు 200 మంది స్త్రీలు కవిత్వమును జెప్పగలవా రున్నారు.

ఇతర కవయిత్రుల కవిత్వమునకుఁ గనకాంబగారికవిత్వమునకు భేదము కలదు. వేదాంతపరిసక్త ఛందోబద్ధముగఁ సరసమైన పద్యముల నిమిడ్చి వ్రాయుట యెంతో కష్టము. అయిన నట్టిదోషము లేశముం దగులనీయక చదువునపుడు భాగవతమా, సీతారామాంజనేయమా యని మనసునకు స్ఫురింపఁజేయునట్లు వ్రాసిన కనకమ్మగారి సామర్థ్యము స్తుతిపాత్రము

---

## శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారికి

# 'కవితిలక' బిరుదప్రదానము

[ శతావధాని వేంకటశాస్త్రి కృతము ]

మ॥ జననంబందితి సత్కవీట్కులమునన్ సత్సేవఁ గావించి పెం
చినకైతన్ బరమాత్మసాత్కృతిగ వాసిన్ సర్వమర్పించి స
జ్జనమాన్యత్వముఁగాంచి శాశ్వతయశస్సంతానమార్జించితో
కనకాంబా! సతులందు నీ కుపమ లోకంబందు లే దెందునేన్.

శా॥ కాశీనాథునివంశదీపకుఁ డనంగా నెందుఁ బెంపొందు నా
గేశుం డేనును శ్రీపదాన్వయుఁడు శ్రీకృష్ణుండు లోనా సుధీ
వైశంపాయనులట్లు నీదుకవితన్ వర్ణించునాఁ డిచ్చు నా
యాశీర్వాదముచాలదే సుకృతిబ్రహ్మానందముం జెందఁగన్.

క॥ ఉవిదకుఁ దిలకముకన్నన్
బ్రవిమలభూషణము లేదు ప్రారబ్ధమునన్
దవుల దది నీకుఁ బోనీ!
"కవితిలకము" వై తి వాత్మకళ్యాణముగన్.

---

5

కవిసార్వభౌమ
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు ఉపపాదించిన తీర్మానము.

---

# "కవితిలక బిరుదప్రదానము"

---

"సమస్త మనుష్యలోకమునకును దరణోపాయ గ్రంథములలో నుత్తమోత్తమమయిన "జీవయాత్ర" యను గ్రంథ రాజమును రచించి జగదుపకారము గావించిన కాంచనపల్లి కనకాంబగారికి చెన్నపుర్యాంధ్రసభవారి యాదరణమున సౌందర్యభవనమున శతావధాని చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారు యాధిపత్యమున జరిగిన మహాసభలో పౌరజన పక్షమున 'కవితిలక' మను బిరుదొసంగి సభవారు వారి కృతజ్ఞతను వెల్లడించుచున్నారు."

కవిసార్వభౌములవా రుపపాదించిన తీర్మానమును సభవా రంద రామోదించిరి.

---

6

# జీవయాత్రా గ్రంథ ప్రశంస.

చెన్నపురి క్రైస్తవ కళాశాలలో
నాంధ్ర ప్రముఖుల యుపన్యాసములు.
ఆంధ్రపత్రిక 1926 సం॥ ఫిబ్రవరి 9 తేదీ.
( కవిసార్వభౌముని యుపన్యాసము నూడి )

గీతాశాస్త్రము, సీతారామాంజనేయము తరువాత జీవ యాత్ర పఠనీయ మని నుడివితిని. అట్టి పాండిత్యము నట్టిబోధనా శక్తి యీకవయిత్రికిఁ గలదా యని పలువురు సంశయింప వచ్చును. ఆమె కవితాసామర్థ్యము పాండిత్యము మున్నగు విషయములు మొన్న సౌందర్య మహాలులో జరిగిన సభలో నిర్ణయింప బడినవి. నేను శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారి యింటికి వెళ్లినపు డామె నన్నుగురించి యాశువుగ

కపటం బెఱుఁగని కవిరా
ట్కృపయే శ్రీకృష్ణలీలకీ లెఱిఁగించె౯
కపటం బెఱుఁగని కవిరా
ట్కృపయే శ్రీకృష్ణలీలకీలెఱిఁగించెన్.

అను పద్యమును జెప్పి యనేకార్థములతోఁ దద్భావ మామె యుపన్యసించినపుడు బ్రహ్మానందము జెందితిని.

ఈయమ గ్రంథమందుఁ గావ్యనిర్మాణమువఱకే ఆమె పనిగాని బోధములన్నియు మహనీయులగు గురువులవని యామె తన గ్రంథమునందు స్పష్టముగఁ జెప్పి యుండుటచే గ్రంథము మిక్కిలి పూజ్యమగుచున్నది.

ఉపోద్ఘాతమం దామె యిట్లు చెప్పియున్నది.——

కం. సాధులు వినిచిన శ్రీహరి
గాధలు బోధములుఁ గావ్యకల్పనమున నా
రాధనమొనరిచి వేంకట
నాథుని సంప్రీతుఁజేసి నడపెద యాత్రన్.

కావున మహనీయుల బోధసారము వెన్నవలె నీ పుస్తకమునం దిమిడియుండుటచే నే నట్లభిప్రాయమొసంగియుంటిని. పెద్దలైన మీరెల్లరు నా గ్రంథమును జదివి యిది సరి యని యెఱుంగఁగోరెదను. ఇట్టి యుత్కృష్టగ్రంథ మెల్లరకు జ్ఞానప్రదమగును గాక!

---

అభినవతిక్కన బిరుదాంకిత

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ గారు

“కవితిలక, కవితావిశారద కంచనపల్లి కనకమ్మగారు రచించిన “జీవయాత్రాసంగ్రహము” దుదముట్ట దిలకించి

తిని. ఇందు కథ నిమిత్తమాత్రము. తత్త్వోపదేశమందే తాత్ప ర్యము. అమృతానందనాథు (గురుని) పరమానుగ్రహమునకుఁ బాత్రమై తత్త్వతః సత్యము నెఱింగిన కనకమ్మగారు ఈ రచ నకుఁ బూనుకొనుట కీ గ్రంథమాత్రపరత్వముచే నని నేఁ దలంపఁ జాలను. ఇతర రచనలవలననే ఆమె ప్రజ్ఞ విదితము. ఆమె విదుషి. పెద్దపెద్ద తరగతులవారికి విద్యనేర్పుటయేకాక, విశ్వవిద్యాలయ ప్రముఖులచే విద్వాన్, ఎం. ఏ. మొదలగు కక్ష్యలకుఁ బరీక్షాధి కారిణిగా నియుక్తయైన విద్యావతి. ఈశ్వరానుగ్రహమునఁ దాను బడసిన విజ్ఞానమును లోకమునకుఁ బంచిపెట్టి తన్మూల మున నొజ్జలపట్ల దన ధర్మము నెఱవేర్చుకొనుటయు, లోకుల శోకసాగరమునుండి యుద్ధరించుటయు నేతద్రచనకుఁ బ్రేరకము లని తలంచెదను.

అమృతానందనాథులవారిని నేను స్వయముగా నెఱుఁగు దును. వారివాక్కుల నెన్నియోమారులు చవిగొని యున్నాను. వారిహృదయ మీ 'వయాత్రి'యందుఁ జక్కఁగాఁ బ్రతిబింబిత మగుచున్నది. వారి యనుభవధార్ఢ్యమెట్టిదో కాని వారు నుడువు దృష్టాంతము లద్భుతములు, అపూర్వములు. వారు చెప్పు నర్థములు మఱితమన్నను మఱుపురానివి. ఇవి యన్నియుఁ గనక మ్మగారు చక్కఁగా గ్రహించిరనుటకు గ్రంథమెల్ల సాక్ష్యముగా నున్నది.

అమృతానందుని యద్భుతోపదేశములు వారితోనే యంతరించి పోకుండ మృదుమధురఫణితి, గ్రంథముఖమున నాంధ్రదేశమునఁ జిరస్థాయులఁ జేసిన విదుషీమణి కనకమ్మగారి గురుభక్తి అభినందనీయము.

---

## హంసవిజయప్రశంస.

[ శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు రచించినది ]

'హంసవిజయ మను నీ నాటకమును గవితిలకబిరుదాంచితురాలు కాంచనపల్లి కనకమ్మగారు రచించినారు. ఈమె యిదివరలో షుమారు పదియేండ్లకు మున్ను జీవయాత్ర యను పద్యకావ్యమును నిర్మించియుండెను. అప్పటికే యీమె పాండిత్యము కవిత్వసంబంధమైన షరిశరమునందు మిక్కిలిగా నుండెను. ఇటీవల నీమె మఱియును విద్యావ్యాసంగ మొనర్చి కొన్ని డిగ్రీలనుగూడ సంపాదించియుండుటచేత మఱింత ధారాశుద్ధి కల్గుటయేగాక యనేకశాస్త్రములకు సంబంధించిన విశేషములుకూడ నవగితమై యున్నట్టు లీ హంసవిజయమును జదివిన ప్రతి విద్వత్కవికిని గోచరించి తీరు నని నా దృఢవిశ్వాసము.

---

# హంసవిజయ ప్రశంస.

(బ్రహ్మశ్రీ జటావల్లభుల పురుషోత్తము, యం. ఏ. గారు)

వేదాంత ప్రతిపాదకమగు హంస విజయ మను నీ స్వతంత్ర గ్రంథ మాంధ్రనాటక చరిత్రలో నూతన శకము నుద్భవింపఁ జేయుచున్నది. ఇంతద్వని ప్రధానమైన నాటక మాంధ్ర వాఙ్మయములో నింతవరకును లేదు. పాత్రోచిత్యము, రసపుష్టి, శబ్దప్రౌఢిమ, భావగాంభీర్యము, కథాచమత్కృతి యహామహమికతో నలరారుచున్నవి.

---

(విమర్శకాగ్రేసర కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు)

శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారి హంసవిజయమను నాటకరాజమును జూచి యమితానందము నొందితిని. ఇట్టి యుత్తమగ్రంథమును వ్రాయు సాధ్వీమతల్లి యీకాలమున నున్నందుల కాంధ్రులందఱను గర్వింపఁదగినది. ఉత్తమనాటక లక్షణము లన్నియు నిం దొప్పుచున్నవి

అధునాతన ప్రాచీన సంప్రదాయముల రెంటి నెఱిఁగి యున్న వారేకాని యిట్లు సర్వజనాదరణీయముగా నేటికాలమున వ్రాయఁజాలరు. శ్రీకనకమ్మగా రిట్టి గ్రంథముల నింకను వ్రాసి యాంధ్రభాషకు, నాంధ్రాళికిని సేవచేయుదురు గాక యని ప్రార్థించుచున్నాఁడను.

---

శ్రీ తిరుమలశ్రీనివాసత్రిలింగ మహావిద్యాపీఠము,
విద్యాశాఖ.

# కవితిలక గ్రంథమాల,

8/71 లాయిడ్సురోడ్డు, కెథడ్రిల్ పోస్టు, మద్రాసు.

శ్రీమతి కవితిలక కవితావిశారద విద్వాన్
కంచనపల్లి కనకమ్మగారు రచియించిన

—• పద్య గ్రంథములు •—

1. శ్రీ జీవయాత్ర — ఇది వేదాంతప్రతిపాదక మగు పద్యకావ్యము రు 2—8—0

2. హంసవిజయము — ఇది మనోహరమగు వేదాంత నాటకము రు 1—0—0

3. అమృతసారము -(పద్యకావ్యము) శ్రవణపేయమగు తత్వబోధ మిందుఁ గలదు రు 1—0—0

4. ఆనందసారము — జిజ్ఞాసువుల కనితరలభ్యమగు తత్త్వరహస్యము లిందుఁ గలవు రు 1—0—0

5. పద్యముక్తావళి — ఇది జీవయాత్రాంతర్గత పద్య సముదాయము రు 0—8—0

6. శ్రీమద్రామాయణకథాసంగ్రహము - ఇది వాల్మీకీయ బాలరామాయణమునకుఁ గంద పద్యములతో నైన యాంధ్రానువాదము రు 0—6—0

7. ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము - ఇది మూలము ననుసరించియు లలితమగు శైలిని వ్రాయబడిన నాటకము. కొన్ని తావులలో మూలమునకు వన్నె పెట్టబడినది రు 1—0—0

8. రంగశతకము-ఇది కవయిత్రి తన పదియు రెండవయేట శ్రీరంగనాయకులపైఁ జెప్పిన కందశతకము 0—4—0.

—• వచన గ్రంథములు •—

1. రాధ—ఇది యొక సాంఘిక నవల. ఉన్నత పాఠశాలల్లలోఁ బాఠ్యగ్రంథముగఁ జిరకాలముగ నుపయోగ పడుచున్నది. రు 0—15—0

2. గౌతమబుద్ధ చరిత్రము—ఇది బౌద్ధమతప్రవర్తయగు బుద్ధదేవుని చరిత్రము. బాలికలకు, బాలకులకుఁ బఠించుటకు యోగ్యము. రు 0—10—0

కవితిలక కనకాంబగారి వచన గ్రంథములు గాని, పద్య గ్రంథములు గాని దాదాపన్నియును మదరాసు యూనివర్సిటీ వారు కొన్ని యున్నత పాఠశాలలకు, కొన్ని ఇంటరుమిడియేటు వారికి, బియ్యేకుఁ బాఠ్యగ్రంథములుగా నేటేట నిర్ణయించుచున్నారు.

—• కవితిలకగారి గ్రంథములు అచ్చులో నున్నవి •—

1. బోధకథాసుధ — (వచనము) తత్త్వబోధమున కుపయోగించు చిన్నకతలు. ఈ కతలు వ్యవహారమునను బరమార్థమునను సమయోచితముగాఁ బ్రయోగించిన శ్రోతల కపరిమితానందము కలుగును.

2. తోమాలిక — ఇది కవయిత్రి యా యాసందర్భములలోఁ జెప్పిన పద్యకుసుమముల సముదాయము. ప్రస్తావోచితము. మనోహరము. సమకాలికులగు మహాకవుల యభిప్రాయ బోధకములగు పద్యరత్నములునుం గలవు.

—• ఇతరుల గ్రంథములు అచ్చులో నున్నవి •—

వైద్యరాజ డాక్టర్, దంటు సుబ్బావధాని కృతములు.

1. దానగీత — ఆత్మానుభూతిని, గురుభక్తిని రసోద్రేకముగ దెల్పునట్టి పద్యకావ్యము. ఈరీతికావ్యములలో నిదియే మొదటిది.

2. అంబికాచరణ సరోజపూజ — ఇందలి భక్తి పారవశ్యము, ధారాశుద్ధి యుపాసకులకు హర్షదాయకములు.

3. ఆంధ్రభామినీ విలాసము — జగద్విఖ్యాతుఁడగు పండితరాయల భామినీ విలాసమున కిట్టి రసవంతమగు నాంధ్రానువాద మింతకు మున్నెవ్వరును రచించి యుండలేదు.

4. చిత్రమాధవనాటకము— ఇది షేక్స్పియరు మహా కవి కామెడీ ఆఫ్ ఎరర్సు అను నాంగ్లనాటకమున కనువాదము.

5. ఆంధ్రవైద్యవిజ్ఞానము— ఇది ప్రాచీనార్వాచీనసంప్రదాయములను బోధించు గద్యపద్యాత్మకమగు వైద్యగ్రంథము.

6. అమృతానందనాథస్వామి చరిత్రము—సాధకులకు సిద్ధులకు అపరిమితానందసంధాయకమగు వచనగ్రంథము.

ధర్మవాది దంటు శ్రీనివాసశర్మ, బి.ఏ., బి.ఎల్., గారిచే

— వ్రాయబడిన గ్రంథములు —

1. నాగభూషణ శతకము— ఇది శ్రీవిద్యుమల శ్రీవాణలింగ మహావిద్యాపీఠస్థాపనాచార్యులగు శ్రీమాన్ అమృతానందనాథస్వామివారి, వ్యావహారిక నామమున కంకితముచేసి చెప్పిన భక్తిశతకము. గురువుల కంకితముచేసిన శతకమగుటచే సాధువులకు సంతోషకారిగా నుండును.

2. శ్రీతులసీదాస చరిత్రము—ఇది మహాభక్తుండును, మహాకవియు నగు తులసీదాసుని చరిత్రము. పద్యకావ్యము. ఆధునిక రచనయయ్యు రసభావభరితమై, యార్యవిజ్ఞాన సంప్రదాయబోధక మగు లలిత పద్యకావ్యము. ముముక్షుజనశ్రేయము.

---